ప్రెస్ పనివారల పరిస్థితుల విచారణకు సంఘాన్ని నియమించాలని అభ్యర్థన
—4 వ పేజీ

# ఆంధ్రపత్రిక

రాజమండ్రిలో మాజీకమ్యూనిస్టులు జరిపిన సభలో ఉపన్యాసకుని అపహరణ
—5 వ పేజీ

THE ANDHRA PATRIKA · MADRAS. సంపుటం 41. సంచిక 124 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO గురువారం 5-8-1954 Reg. No. M. 1118 6 పేజీలు వెల 1 అణా.

# ఈనాం రైతుల తొలగింపును అరికట్టడమే బిల్లు ప్రధాన లక్ష్యం

## ఆంధ్రప్రభుత్వం శాసనాన్ని 1953 అక్టోబరు నుంచీ అమలుచేసే సూచన

### ఈనాముల రద్దుకు ఉత్తరోత్తరా ప్రత్యేకబిల్లును ప్రవేశపెట్టే ఆలోచన

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

కర్నూలు, ఆగస్టు 4: ప్రతిపాదించదలచిన ఈనాం రైతుల రక్షణ బిల్లు 1953 అక్టోబరు 1 వ తేదీనుంచి అమలులోకి వస్తుంది.

ప్రస్తుతానికి, ప్రతిపాదించదలచిన బిల్లు ఈనాంభూముల నుంచి రైతుల బహిష్కరణను అపుదలకుమాత్రమే ఉద్దేశించబడుతుంది. బిల్లును ప్రకటించేముందు మునాయిదాలో ప్రభుత్వం ఏమైనా మార్పులు చేస్తుందేమో చూడవలసి వుంది.

1936 ఈనాముల రద్దు సమస్య తర్వాత తీసుకోబడుతుందని ప్రభుత్వ వర్గాల ద్వారా తెలుస్తున్నది.

... శాస్త్రీయ శాసనసభా సమావేశం పూర్తయేలోగా రాష్ట్రపతి ఆమోదం రాని పక్షంలో ఆర్డినెన్సు జారీచేయబడుతుందని ప్రభుత్వం ఆ సమావేశంలో ప్రకటించిన సంగతి పాఠకులకు విదితమే. ... శాస్త్రీయ శాసనసభా సమావేశం ... రాష్ట్రపతి ఆమోదం ...ంది.

...నుంచి ముఖ్యమంత్రి తిరిగి ...నికి వచ్చేవరకూ ప్రభుత్వం ఈ ...ంలో ఇప్పట్లో ఎట్టి నిర్ణయాన్ని ... పోవచ్చును.

...కాలంనుంచి పలు ప్రాంతా... ఈనాం రైతుల తొలగింపు ...రున్నట్లు ప్రభుత్వానికి ఆక్షేప...వస్తున్నాయి. కాంగ్రెసు శాసనపక్షంవారు ఈ సమస్యను చర్చిం...రు. ఈనాం రైతుల రక్షణకు ప్రభుత్వం అనుసరించవలసిన విధానాలను సిఫార్సు చేస్తూ పార్టీనాయకునికి ఉపసంఘం ఒక నివేదికను సమర్పించింది.

## ఫజల్ అలీ కమిషన్‌కు ఆంధ్రప్రభుత్వ వాదన

### ప్రతిపాటి సత్యనారాయణ రావుగారి నియామకం

మద్రాసు, ఆగస్టు 4: ఫజ్లా అలీ కమిషను ఎదుట ఆంధ్ర ప్రభుత్వ పక్షాన ఆంధ్ర రాష్ట్రానికి రావలసిన భూభాగాలను గూర్చి వాదించడానికి ఆంధ్ర ప్రభుత్వంవారు మద్రాసు హైకోర్టు మాజీ న్యాయమూర్తి ప్రతిపాటి సత్యనారాయణ రావుగారిని కోరారనీ, వారు ఆ ప్రకారం వాదించడానికి తగిన సమాచారాన్ని సేకరించడంలో నిమగ్నులయ్యారనీ తెలుస్తోంది.

## అన్ని రకాల 'ఇనాం' ఎస్టేట్ల రద్దుకు సత్యాగ్రహం

### ఈ నెల 9 వ తేదీనుండి ప్రారంభించుటకు ప్రజా సోషలిస్టు పార్టీ నిర్ణయం

విజయవాడ, ఆగస్టు 3: "అన్నిరకాల ఇనాం ఎస్టేట్లను ప్రభుత్వంచే రద్దుచేయుటకును కౌలుగదువు న్యాయమయిన కౌలును నిర్ణయింపచేసేందుకున్నూ ఈ నెల 9 తే నుండి సత్యాగ్రహం ప్రారంభించుటకు ఆంధ్రప్రజా సోషలిస్టు పార్టీ తీర్మానించింది.

పార్టీ నిర్ణయాన్ని, ఈవాళ సంయుక్త కార్యదర్శి శ్రీ ఎ. చక్రధర్ గారు వెల్లడించారు. కర్నూలు జిల్లా నంది కొట్కూరు తాలూకా కరివేన గ్రామంలో పార్టీ అధ్యక్షుడు శ్రీ కొమ్మా రెడ్డి సూర్యనారాయణగారు స్వయంగా ప్రారంభిస్తారు.

పార్టీ తలపెట్టిన సత్యాగ్రహం, శాంతిభద్రతలను విచ్ఛిన్నం చేయాలని గాదనీ, మాగాణి భూముల నుండి వెళ్ళగొట్టబడుతున్న రైతులను కాపాడుటకేనని, శ్రీ చక్రధర్ గారు చెప్పారు.

## గుడియాత్తం ఉపఎన్నిక

### వోట్ల లెక్కింపు: మద్రాసు ముఖ్యమంత్రికే మెజార్టీ

మదరాసు, ఆగస్టు 4: మదరాసు అసెంబ్లీకి గుడియాత్తం నియోజకవర్గం నుండి జరిగిన ఉపఎన్నిక ఫలితాలు యింకా తెలియలేదు. ఓట్ల లెక్కింపు నిన్న ఉదయం ప్రారంభమై రాత్రి 9 గంటల వరకు సాగినప్పటికీ అనేక బాలెటు పెట్టెలు మిగిలియుండినవి. తిరిగి యీ దినం లెక్కింపు ప్రారంభమైనది. ఫలహారపు వేళకు ఆయా అభ్యర్థులకు లభించిన ఓట్లసంఖ్య యీ రీతిగా వుండినవి.

| | |
|---|---|
| ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్ నాడార్ (కాంగ్రెసు) | 46181 |
| కోదండరామన్ (కమ్యూ) | 21925 |
| టి. మనవాళన్ (కాం. రిజర్వు) | 37222 |
| కృష్ణస్వామి (ఎస్. సి. ఎఫ్.) | 19104 |
| ఆదిమూలం (స్వతంత్ర) | 3321 |

## "పఖ్తూనులపై పాకిస్తాన్ దౌర్జన్యానికి దిగితే, ప్రత్యుత్తరానికి సిద్ధమే"

### బెదిరింపులకు పఖ్తూన్లు లొంగరని సరిహద్దు ముఖ్యమంత్రికి కేంద్రజిర్గా హెచ్చరిక

న్యూఢిల్లీ, ఆగస్టు 3: "పఖ్తూనుల స్వాతంత్ర్య ఉద్యమాన్ని అణిచి వేయడానికి, పాకిస్తాన్ గనుక ఖడ్గాన్ని ఉపయోగిస్తే, దానికి పఖ్తూనులు తగినట్లు ప్రత్యుత్తరం ఇస్తారు" అని కేంద్ర పఖ్తూన్ జిర్గావారు నేడు ఒక ప్రకటనలో పాక్ సరిహద్దు రాష్ట్రం ముఖ్యమంత్రి రషీద్‌కు గట్టిగా జవాబు చెప్పారు.

మొన్న సీ ఖయ్యూ ఒక ప్రకటన చేస్తూ యీ రషీద్ తాము పఖ్తూనులను బలాన్ని ప్రయోగించి అణిచివేస్తామంటూ ఒక బెదురును పెట్టారు. నేను యీ కమిటీవారు, పఖ్తూనులు బెదిరింపులకు జడిసే మనుష్యులు కాదని ఇటువంటి బెదిరింపులకు జూదకోర్లు అంతా అయిపోయిన స్థితిలో దిగుతారని, యీ రషీద్ చేస్తున్న బెదిరింపులు అప్పుడట్లాగే వున్నాయని గలిచేశారు.

పఖ్తూన్‌లు వలస రాజ్యాధిపతుల యొక్క యేమి, సామ్రాజ్యవాదుల యొక్క యేమి, వేషాలు చాలా చూశారు. ఇప్పుడు ప్రపంచంలో ఎక్కడపడితే అక్కడ ఇట్టి ప్రబుద్ధులు లోకులు మునుస్తున్నారు. పాకిస్తాన్ ఏజంట్లు గూడా అట్లా లోకము పెవ్వడం మంచిది. లేదా వారు ఎందుకు సిద్ధమైతే నేము అందుకు సిద్ధమాతాం అని వీరు ఇందులో నివేదం చేశారు.

## కొరియా యుద్ధవిరమణ సంఘానికి స్వస్తి

### అమెరికా సుముఖమేనని డలెస్

వాషింగ్టన్, ఆగస్టు 3: కొరియాలో యుద్ధ విరమణ వర్యవేక్షణ జరుపుతున్న తటస్థ రాజ్యాల సంఘానికి స్వస్తి చెప్పాలన్న ప్రతిపాదనవట్ల అమెరికా సుముఖంగావుంటుందని అమెరికా విదేశాంగమంత్రి డలెస్ నేడిక్కడ ప్రకటించారు.

ఈ విషయమై అమెరికా బ్రిటనుకు ఇంకా ఎట్టి ప్రతిపాదనా చేయలేదని విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకరు వివరించారు.

తటస్థరాజ్య సంఘంలోని కమ్యూనిస్టు సభ్యులు (పోలెండు, జెకోస్లవేకియా), చాలా ఆక్షేపణీయమైన పనులు చేయటమే తమ వైఖరికి కారణమని డలెస్ అన్నారు. తటస్థ సంఘాన్ని రదుచేయటం యుద్ధవిరమణ ఒప్పందాన్ని భిన్నపరచటం కాదని తాను అభిప్రాయపడుతున్నట్లు ఆయన తెలియజేశారు.

నేడు సేవూల్‌లో దక్షిణకొరియా పోలీసు శాఖాధికారి చాంగ్ దంగ్ కిం ఒక ప్రకటన చేస్తూ పోలెండ్, జెకోస్లవేకియాల ప్రతినిధులు గూఢచారులుగా వ్యవహరిస్తున్నట్లు సాక్ష్యం దొరికితే, వాళ్ళను అరెస్టు చేయటం కూడా జరుగుతుందని ప్రకటించారు.

#### రీ మొండితనం కప్పిపుచ్చటానికి డలెస్ తాపత్రయం

శాంతియుతంగా కొరియాను ఏకం చేయాలనే అమెరికా ఇంకా అభిప్రాయపడుతున్నందుకు దక్షిణ కొరియా అధ్యక్షుడు సింగ్మన్ రీ ఇటీవల వాషింగటన్‌లో తీవ్రంగా విమర్శించారు. దానిపై డలెస్ వ్యాఖ్యానిస్తూ, అమెరికాలో ఎండదెబ్బ బాగా కొట్టి, కొంత చిరాకుపడి వున్నందువల్ల అట్లా వెక్కసంగా మాట్లాడారని సమర్థించారు.

## తిరుపతి విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షుడు

మద్రాసు, ఆగస్టు 4: తిరుపతి విశ్వకళాపరిషత్తు ప్రత్యేకోద్యోగి శ్రీ. రంగధామరావుగారిని విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షులుగా మూడేళ్లపాటు నియమిస్తారని తెలుస్తోంది.

## అమెరికా సూచించిన ఆగ్నేయాసియా సభకు కొలంబో రాజ్యాల నిరాకరణ

### ఫిలిప్పీన్స్ ప్రయత్నాల వైఫల్యం: ఇండియా, ఇండోనీషియా, సింహళాల సమాధానం

#### బ్రిటిష్ వైఖరిపై విదేశాంగశాఖ వివరణ

మానిలా, ఆగస్టు 3: "ఆగ్నేయాసియా రక్షణ ఒప్పందంపై చర్చించే విషయమై అమెరికా ఏర్పాటుచేసే సమావేశానికి కొలంబో సభ రాజ్యాలను ఫిలిప్పీన్స్ ఆహ్వానించింది. ఆ ఆహ్వానాన్ని భారతదేశం సింహళం, ఇండోనీషియాలు నిరాకరించినవి. పాకిస్థాన్ బర్మాలుకూడా నిరాకరించవచ్చును", అని ఫిలిప్పీన్ విదేశాంగమంత్రి కార్లోస్ గార్సియా నేడు వెల్లడించారు.

"అమెరికా ఈ సమావేశాన్ని సెప్టెంబర్ మొదటివారంలో జరపాలని సంకల్పించింది. ఈ విషయమై వాషింగ్టన్‌లో ప్రాథమిక సంప్రదింపులు జరుగుతున్నవి. ఇప్పటివరకూ ఈ సమావేశానికి హాజరుకాగలమని అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, సయాం, ఫిలిప్పీన్‌లు కచ్చితంగా మాట ఇచ్చినవి. ఫ్రాన్స్ ఇంకా జవాబివ్వలేదు" అని గార్సియా తెలియజేశారు.

డిసెంబర్ నెలలో పాకిస్తాన్, సింహళ ప్రధానులు ఇక్కడికి రావటంతో ఈ ఒప్పందానికి ఏమీ సంబంధం లేదని ఆయన అన్నారు.

#### డలెస్ తొందర

ఆగ్నేయాసియా రక్షణవ్యవస్థపై సమావేశం జరిపేవిషయమై ఒకవారంరోజుల్లో నిర్ణయంజరగటం అవసరమని అమెరికా విదేశాంగమంత్రి డలెస్ నేడు వాషింగ్టన్‌లో ప్రకటించారు.

ఇప్పుడు ఈ సమావేశంలో సైనిక సమస్యలకన్నా ఆర్థిక సమస్యలకే అమెరికా ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నట్లు న్యూయార్క్ పత్రికలు సూచిస్తున్నవి.

#### బ్రిటన్ వివరణ

లండన్, ఆగస్టు 3: భవిష్యత్తులో ఆగ్నేయాసియా రక్షణ సమస్యపై బ్రిటన్ అభిప్రాయాలను వివరీకరిస్తూ కొలంబో రాజ్యాలకు బ్రిటిషు విదేశాంగ కార్యాలయం సందేశాలను పంపించిందని నేడు వెల్లడించబడ్డది. ఇవి గత శనివారమే ఆయా ప్రభుత్వాలకు ఆయా రాజధానుల్లో అందజేయబడ్డవని విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకరు వెల్లడించారు.

ఈ సందేశాల్లో కొలంబో రాజ్యాలను ఆగ్నేయాసియా వ్యవస్థలో చేరవలసిందిగా కోరటం జరగలేదని తెలుస్తున్నది. రక్షణవ్యవస్థలో చేరటానికి నిరాకరిస్తూ ఇండియా సమాధానం ఇచ్చినదన్న వార్తలను ఈ ఉద్యోగి ఖండిస్తూ, ఇంకా ఎవరిదగ్గరనుంచీ సమాధానం రాలేదని తెలియజేశారు.

ఇండోచైనా ఒప్పందానికి హామీ ఇవ్వాలని కొలంబో సభ దేశాలు ప్రకటన చేయాలని బ్రిటన్ కోరియున్నది. దానికి కూడ ఇంకా సమాధానం రాలేదు.

## నెహ్రూ ప్రత్యామ్నాయ ప్రతిపాదన

### లంకప్రధాని సూచన

కొలంబో, ఆగస్టు 3: ఆగ్నేయాసియా రక్షణకు పశ్చిమరాజ్యాలు ప్రతిపాదించిన రక్షణ సమాఖ్యకు భారత ప్రధాని నెహ్రూ దగ్గర ఒక ప్రత్యామ్నాయ ప్రతిపాదన ఉన్నదని సింహళ ప్రధాని కొటెలవల నేడు సింహళ పార్లమెంటులో ప్రకటించారు. ఆ ప్రతిపాదన ఏమిటో తన కింకా తెలియదనీ, అయితే అది ఒకటి ఉన్నట్టు పండిత నెహ్రూ ద్వారానే తనకు తెలిసిందనీ ఆయన వెల్లడించారు. దానిని సెప్టెంబర్‌లో రంగూన్‌లో కానీ కొలంబోలో కానీ జరిగే సమావేశంలో చర్చించటం జరుగుతుందనీ, అది పూర్తిఅయేవరకూ, సింహళం ఎట్టి నిర్ణయమూ చేయదనీ ఆయన ప్రకటించారు.

"ఆగ్నేయాసియా రక్షణవ్యవస్థపై సమాలోచనలు జరిపేందుకు ఇండోనీషియా ఇండియాతోపాటే నిరాకరించింది. పాకిస్థాన్ చర్చలకు సమ్మతిని సూచించింది. బర్మా మాత్రం తన అభిప్రాయాన్ని తెలియజేయలేదు" అని ఆయన తెలియజేశారు.

ఆగ్నేయాసియా ఒప్పందంమీద ప్రతికూలపక్షం ప్రతిపాదనమీద జరిగినచర్చలో జోక్యం కలిగించుకుని సింహళ ప్రధాని యీ అంశాలు తెలియజేశారు.

"భారతప్రధాని తాను ఆగ్నేయాసియా ఒప్పందంలో చేరలేదని ఖండితంగా చెప్పిన తరువాత తిరిగీ సమాలోచనలు జరపాలని కొటేలవల ప్రయత్నించటం అమెరికా ప్రాపకాన్ని ...

(2 వ పేజీ చూడుడు)

## అగస్టు 15 న గోవధ నిషేధం

### అజ్మీర్ మేజస్ట్రేటు ఉత్తర్వు

అజ్మీర్, అగస్టు 3: ఆగస్టు 15 స్వతంత్రదినోత్సవంనాడు అజ్మీర్‌లో గోవధ జరగరాదని అజ్మీర్ జిల్లా మేజస్ట్రేటు ఒక ఉత్తర్వును నేడు జారీ చేశారు.




## ట్యునీషియా నూతనప్రభుత్వంలో స్థానం: నియోదస్తూర్ పార్టీసమ్మతి

### మెండెస్ ఫ్రాన్సు విధానానికి ఫ్రాన్సులో ప్రతిఘటన

జెనీవా, ఆగస్టు 3: ట్యునీషియాలో ఏర్పడుతున్న కొత్త ప్రభుత్వంలో పాల్గొనడానికి నియోదస్తూర్ జాతీయ పక్షంవారు నేడు తమ సమ్మతిని ప్రకటించారు. ట్యునీషియాకు హోంరూల్ ప్రసాదాన్ని గూర్చి గూడా ఫ్రాన్సులో వెంటనే సమాలోచనలు ప్రారంభం కావాలనిగూడా వీరు ఏకగ్రీవంగా తీర్మానించారు.

ఈపార్టీ తాలూకు రాజకీయసంఘం వారు నేడు జెనీవాలో సమావేశమై ఫ్రాన్సులో ప్రవాసిగావున్న తమ నాయకుడు హబీబ్ బుర్గుబా అభిలషితాన్ని అనుసరించి యీనిర్ణయాలు చేశారు. యీపార్టీ రాజకీయ సారధియుం, వలీం పారిస్‌కువచ్చి, బుర్గుబా యుభావాలు తెలుసుకువచ్చారు.

ఈసమావేశం ఇంకా ప్రారంభం కాకముందే ట్యునీషియా జాతీయ నాయకుడు హబీబ్ బుర్గుబా ఒకప్రకటనచేస్తూ ఫ్రాన్సు ట్యునీషియా సంబంధాలు ఎట్లా వుండాలని తాము ఆశిస్తున్నది వివరిస్తూ, స్వాతంత్ర్యంతో గూడిన సహకారంగా ఆసంబంధాలు ఏర్పడాలని స్పష్టంచేశారు. ఈ యన యీ ప్రకటనను లక్షింబర్గు రేడియో బ్రాడ్‌కాస్ట్‌గూడా చేసింది. ఈ ప్రకటనలో ఆయన తనపక్షంవారు ట్యునీషియాలో బీన్‌అమ్మార్ ప్రభుత్వంలో పాల్గొనగలదని ఆయన్ను బలపరచగలరని హామీ ఇచ్చారు.

అయితే ఫ్రాన్సులో మాత్రం ఫ్రెంచి పార్లమెంటులోని కన్‌సర్వేటివ్‌లు ప్రధాని మెండెస్ ఫ్రాన్స్ ట్యునీషియాపట్ల అనుసరిస్తున్న ఈవిధానాన్ని ప్రతిఘటించడానికి తగిన బలాన్ని చేకూర్చుకోడానికి ప్రయత్నము చేస్తున్నారు. ఈప్రయత్నం పూర్వం ఒకప్పుడు ఫ్రెంచి ప్రధానిగా పనిచేసిన ఆంటోనీపే నాయకత్వాన జరుగుతోంది. ఈయన మాట వింటామంటున్నవాళ్లు దాదాపు ఒక 100 మంది మితవాద పార్లమెంటు డిప్యూటీలుకన్పిస్తున్నారు. గురువారంనాడు, శుక్రవారంనాడు, ఈ ట్యునీషియా వ్యవహారం పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు వీరు మెండెస్ ఫ్రాన్సుపట్ల అవిశ్వాసాన్ని ప్రకటిస్తూ ఒక తీర్మానాన్ని తీసుకురాదలచుకుంటున్నట్లు తెలుస్తున్నది.

## గంటల పంచాంగం

శ్రీ జయ నంII శ్రావణ శుII షష్ఠి
1954 సంII ఆగస్టు 5 గురువారం
శుII షష్ఠి 8-47 చిత్ర 20-18 వర్జ్యం
రా 2-36 ల 4-24 వ.
శుII సప్తమి ఆగస్టు 6 శుక్రవారం
శుII సప్తమి 11-8 స్వాతి 23-15 వర్జ్యం
రా 5-31 ల.

ఆంధ్రపత్రిక

ఒడలేయుని యొనరించిన సరసర
యుపకరము తన మనంబున తగు రా
వొరులకు నవిసేయుకవికి వరాయణము
పరముధర్మపథములకెల్లన్.-(మహాభారతము)

శ్రీ జయ నంII శ్రావణ శుII షష్ఠి
గురువారం

## సమాజ వికాస కేంద్రములు

సమాజవికాస కేంద్రములు, జాతీయ విస్తరణ సేవా కార్యక్రమములు పల్లెపట్టున విప్లవాత్మకమైన మార్పులను కల్గించునని, గ్రామములలో ఆర్థికసామాజిక విప్లవసాధన కవి అత్యంత శక్తివంతమైన పరికరములని ప్రధానమంత్రి మొదలు, ముఖ్యమంత్రివరకు ఉద్ఘాటించిరి. ఈ కార్యక్రమముల నిర్వహణ అత్యంత తృప్తికరముగ నున్నదని మంత్రులు, అధికారులు తరచు ప్రకటనలు చేయుచుండిరి. సమాజవికాస కేంద్రములందును, జాతీయవిస్తరణసేవా కార్యక్రమము అమలు జరుగుచున్న ప్రాంతములందును ఇంతవరకు జరిగిన పని ఈ ప్రకటనలకు అనుగుణముగ నున్నట్లు కన్పించదు. నంద్యాలలోను, కర్నూలులోను ఈవారము జరిగిన అధికారుల సమావేశముల చర్చలు ఈవిషయమును స్పష్టం చేసినవి.

సమాజవికాస కేంద్రములలో జరుగవలసిన పనికి ఒక ప్రమాణమును నిర్ణయించిరి. మూడు సంవత్సరములలో 120 లక్షల రూపాయిలను ఖర్చు చేసి కడప - కర్నూలు కాల్వ ప్రాంతమును, సామర్లకోట ప్రాంతమును అభివృద్ధి చేయవలసియుండెను. మూడు సంవత్సరములకాలములో 21 మాసములలో కడప-కర్నూలు కాల్వ ప్రాంతమున అయిదు లక్షల రూపాయిలు మాత్రమే వ్యయమైనవి. సామర్లకోట ప్రాంతమున మాత్రము మంజూరైన మొత్తములో మూడవభాగము వ్యయమైనది. పదునైదు మాసములలో ఈరెండు ప్రాంతములందు నూనూరు కోటి రూపాయిలు ఖర్చు కావలసియున్నది. మంజూరైన మొత్తమును ఖర్చు చేయుటే లక్ష్యమైన ఒకటిరెండు మాసములలోనే నిల్వవున్న కోటిరూపాయిలను ఖర్చు చేయవచ్చును. కాని అసలు కార్యక్రమ లక్ష్యము పదునైదు మాసములలో సిద్ధించునా యను సందేహము మాత్రము రాష్ట్రములో నున్న రెండు కేంద్రములలో జరిగిన పనిని గమనించిన వారందరికీ కల్గుట సహజము.

కార్యక్రమము ప్రకారము పని జరుగనందున ఈ రెండు కార్యక్రమములను ప్రజలను అంతగ ఉత్సాహపరచలేదని భావింపవలసియుండును. ప్రజలను, ఈ కార్యక్రమ కర్తలూహించినంతగ, ప్రణాళికలు ఉత్సాహపరచకల్గిన మూడు సంవత్సరముల పని కొనసాగింప త్సరములలోనే పూర్తి కాగలదు. కార్యక్రమము నిర్ణయించిన పనికంటె ఎక్కువ పని, తక్కువ వ్యయముతో జరిగియుండెడిది. మరి రెండు సంవత్సరములలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభము కానున్నది. ఈ ప్రణాళికకు ఆంధ్రరాష్ట్రములో అరువది కోట్ల రూపాయిలను సమకూర్చవలసియుండునని అభివృద్ధి కమీషనరు డాక్టరు నటరాజన్ గారు నంద్యాల సభలో ప్రకటించిరి. ఈ అరువది కోట్లను గాను రాష్ట్ర ప్రభుత్వము రానున్న అయిదు సంవత్సరములలో పదికోట్ల రూపాయిలను మాత్రమే సంపాదింపగలదని వీరు వెల్లడించిరి; శేషించిన మొత్తమును ప్రజలు ధనరూపమున, పని రూపమున సేకరింపవలసియుండునని వీరు హెచ్చరించిరి.

ఆంధ్ర ప్రభుత్వము, ఆంధ్ర ప్రభుత్వ కార్యవిధానములు ప్రజలలో ఉత్సాహమును కల్పింపలేదు. ప్రభుత్వము ఎంకల్పించిన పనులు తమ అభివృద్ధికేనని ప్రజలు గుర్తించినట్లు కన్పింపదు. ప్రజలు ముఖ్యమని, అవసరమని తలంచిన కార్యక్రమములు, ప్రణాళికలు, ప్రాజెక్టుల విషయమున ప్రభుత్వము శ్రద్ధ వహింపకపోవుటే ఈ పరిస్థితికి కారణము. సమాజ వికాస కేంద్రములుగాని, జాతీయ విస్తరణసేవా కార్యక్రమములుగాని ప్రజల దృక్పథమును, మనస్తత్వమును మార్పు చేయలేకపోయినవి. ఈ పరిస్థితికి పూర్తిబాధ్యతను ఈ కార్యక్రమ నిర్వహణాధికారులే వహింపవలసియున్నది. రాష్ట్ర ప్రభుత్వము ఈ యథార్థమును గ్రహించినట్లు కన్పించుచున్నది. రానున్న పదునైదు మాసములలో శేషించిన కార్యక్రమమును పూర్తిచేయు బాధ్యతను, ఈ కార్యక్రమములతో సంబంధమున్న రాష్ట్రప్రభుత్వ కార్యదర్శులు స్వీకరింప తీర్మానించుకొనిరి.

ప్రస్తుతము కార్యక్రమ నిర్వహణలోగల లోపములను పరిదిద్దవలసియున్నది. ఇంతవరకు జరిగిన పనిని పరిశీలించి, సమగ్రమైన విచారణను జరుపుట అవసరము. విచారణను సంఘములద్వారా జరిపించుటకంటే, విషయపరిజ్ఞానము కల్గిన ప్రవీణునిచే జరిపించుట ఎక్కువ వాంఛనీయము. నంద్యాలలోను, కర్నూలులోను జరిగిన అధికారుల సమావేశములీ విషయమును పరిశీలించినట్లు కన్పింపదు. ఇంతవరకు జరిగిన పనితో వారు తృప్తిపడినట్లు కన్పించుచున్నది. ఈ భావముతో, ఈ దృక్పథముతో, ఎంత తీవ్ర కృషి చేసినను ప్రయోజనము ఉండదు. కార్యాచరణ విధానమే మార్పు చెందవలసియున్నది.

## వినోబా భావే భూదానోద్యమం

### పాటియాలా మహరాజు భూరి విరాళం

అంబాలా, ఆగస్టు 3: పాటియాలా మహారాజు తన ఆస్తిలో 3352 బిఘాల నేలను ఆచార్యభావే భూమి దానయజ్ఞోద్యమానికి విరాళంగా ఇస్తూ పంజాబ్ పెప్సూభూమి దాన సమితికి దానపత్రాన్ని పంపించారు.

ఈ సమితివారు ఈ విరాళాన్ని అందుకొని, మహారాజుగారి ఈ వితరణంవల్ల పంజాబు, పెప్సూ రాష్ట్రాలలో భూమి దానోద్యమం జయప్రదం కావడానికి మహావకాశం ఏర్పడుతున్నదని ఒక ప్రకటన చేశారు.

# ఉప్పుటేరు రెగ్యులేటర్

# 11 లక్షల వ్యయంతో 20 వేల ఎకరాలు సాగుకు తెచ్చే ప్రణాళిక

(మం. చంద్రశేఖర్)

కొల్లేరు సరస్సు మధ్యభాగంలో సుమారు 20000 ఎకరములు దాళ్వా సాగుక్రిందకు తీసికొని రావడానికి రు. 10.68 లక్షల ఖరీదుగల ఉప్పుటేరు రెగ్యులేటరు స్కీము అనే ప్రణాళిక ఒకదాన్ని చాలా సంవత్సరాలక్రితమే అప్పటి మద్రాసుప్రభుత్వపు ఛీఫ్ యింజనీరుగారు ఆమోదించి ప్రభుత్వం వారి మంజూరుకు పంపిఉన్నారు. స్కీము వివరా లీక్రింది విధంగా వున్నవి.

కొల్లేరు సరస్సు అనబడేది, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాల మధ్య ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన పల్లపుప్రదేశము. ఈ ప్రదేశంలోకి రెండుజిల్లాలకు సంబంధించిన సుమారు 2120 చదరపుమైళ్ళ ప్రాంతంలోకి మురుగునీరు ప్రవహిస్తుంది. ఈ 2120 చదరపుమైళ్ళలో 1608 చదరపు మైళ్లు మెట్టప్రాంతమూ 512 మైళ్లు పల్లపు ప్రాంతమూ యై ఉన్నాయి.

ఈ సరస్సులో 6.0 వ కొంటూరు వరకు పల్లపుప్రాంత మనవచ్చును. ఈ కొంటూరులో నీరు ఎండినపుడు నీరు 230 చతురపు మైళ్ళ విస్తీర్ణంలో వ్యాపించిఉంటుంది. ఈ 6.0 వ కొంటూరు వరకు సాధారణంగా డెల్టా సాగులు వ్యాపించిఉంటాయి. ఈ 6.0 వ కొంటూరుకు క్రిందుగా ఉన్న భూములు వర్షాకాలంలో కొల్లేటికి వచ్చు సాధారణ ముంపువల్లనే మునిగిపోవును. కొల్లేరు సరస్సునుండి నీరు బయటకు పోవుటకుగల ఒకేఒకమార్గము ఉప్పుటేరు మాత్రమే. ఈ ఉప్పుటేరు కొల్లేటిలోని నీటిని తీసికొని, చినగొల్లపాలెంప్రాంతంలో సముద్రంలో కలుస్తున్నది.

2. కొల్లేటిఅంచుల దరిదాపునఉన్న రైతులు ప్రతి సంవత్సరము జనవరి నెలలో కొల్లేటిలోని నీరు తగ్గి వెనుకకు పోవుకొలదీ ఈ అంచులలో దాళ్వా సేద్యం చేస్తుంటారు. కొల్లేటినుండి నీరు బయటకుపోయే మార్గాలకుఅడ్డుగా కట్టలు నిర్మించి, నీరంతా సముద్రంలోకి పోకుండా అరికట్టి నిలవచేసినట్లయితే, ఈ దాళ్వాసాగును, కొల్లేటి అంచులలోనూ, సరస్సు మధ్యభాగంలోనూకూడా విస్తరింప జేసేందుకు అవకాశం ఉన్నది. కొల్లేటినీరు సముద్రంలోకి పోవడానికి ఉప్పుటేరు ఒక్కటే మార్గం కనుక ఉప్పుటేరుకు ఆనకట్టి, కొల్లేటిలో 4.0 వ కొంటూరు వరకూ నీరు నిలవచేస్తే, ఈ విషయంలో చాలా సహాయకారిగా వుంటుంది.

3. ప్రస్తుతం కూడా, కొల్లేటిలో లోతు ప్రాంతాలలో మిగిలిపోయే నీటిని, పంపులద్వారా తోడి రైతులు దాళ్వాపంట సాగుచేస్తున్నారు. కాని, సరియైన వరదలు లేనప్పుడు, నీరు త్వరితంగా ఉప్పుటేరు గుండా సముద్రంలోనికి ప్రవహించిపోవడం ఈ దాళ్వా సాగులను, చివరి రోజులలో సరియైన సప్లయి లేకపోవడం సంభవించి, పంటలు పోవుట కల్గుచున్నది. అట్టితరుణంలో, వీలైనచోట్ల కృష్ణా డెల్టానుండి నీరు సప్లయిచేసి, పంటలను బ్రతికించవలసివస్తూంది. కాని, ఈ "ఉప్పుటేరు రెగ్యులేటరు" ప్రణాళిక అమలు పర్చినట్లయితే ఈ యిబ్బంది వుండదు. అంతే కాకుండా, సరస్సులో అధికంగా నీరు నిలవచేయగలగడం వల్ల, సాగుచేసే విస్తీర్ణమును ప్రస్తుతమున్న దానికంటే 20,000 ఎకరాలు పెంపుదల చేయ వీలగును.

4. ఇందునిమిత్తం, పెరంటాలు కనుమకు ఒక హెడ్ రెగ్యులేటరు పడవల ప్రయాణానికి అవకాశముండేలాగున, లాకుతో సహా నిర్మించుటయు, జువ్వికనుముకు, రావి కనుమ కలసినచోటుకు క్రిందుగా ఒక రెగ్యులేటరునూ నిర్మించుట కొరకు ఈ ప్రణాళిక తయారు చేయబడినది. ఈ పెరంటాలుకనుము, జువ్వికనుము, కొంతదూరము ప్రవహించిన మీదట కలిసి, ఉప్పుటేరు అని పిలవబడుచున్నది. ఈ ప్రణాళికలో, నీరు లాగుటకు పడవల ప్రయాణమునకు కాలువలు త్రవ్వుటకు, కూడా ఏర్పాటు చేయబడినది. రైతులు పంపులు మొదలను వాని నిమిత్తం వేసికొనే తోటలు ఏ సంవత్సరాని కా సంవత్సరం నాశే త్రవ్వుకోవలసియుండును. ప్రత్యక్షంగా రెగ్యులేటర్ల నిర్మాణాని కయ్యే వ్యయమే కాక, కావాల్సి నిలవ నిమిత్తం పాకలు, మంచినీటి సదుపాయాలు, అడ్డగట్లు వేయుట, యితర ప్రాంతాలనుండి కార్మికులను తెసికొని వచ్చుట, సరదవలలో తేడాలు,యితర అనుకోని ఖర్చులకు కూడా ఏర్పాటు చేయబడినది.

5. సాగుకు లభించే విస్తీర్ణము, కొల్లేటిలో 6.0 వ కొంటూరుకు 4.0 వ కొంటూరుకు మధ్య 45 వేల ఎకరముల భూమి ఉన్నది. ఈ విస్తీర్ణంలో సుమారు 8 వేలంచు యిప్పటికే సాగులో ఉన్నదని గ్రహించినా, సాగునిమిత్తం యింకనూ 20,000 ఎకరములభూమి ఉండగలదు. ఈ విస్తీర్ణంలో నూడింట రెండువంతు జనవరి నెల సాగుక్రిందకు వస్తుందని అంచనావేసి కొన్ని స్వల్పమైన కడీపం 20,000 ఎకరములు భూమి క్రొత్తగా సాగుక్రిందకు రాగలదని నిస్సందేహంగా చెప్పవచ్చును.

6. లభింపగల నీరు. కొల్లేటిలో 4.0 కొంటూరు, 8.0 వ కొంటూరులమధ్య పట్టుబడి వట్టుగల నీటిప్రమాదము 4115 మిలియనుల ఘన అడుగులుండును. 10 ఎకరములను ఒక మిలియనుఅడుగుల నీరు చొప్పున ఈ నీరు 41,150 ఎకరములు సాగుచేయుటకు సరిపోవును. పైన జెప్పినట్లు యిప్పటికే 15000 ఎకరాలు సాగులో ఉన్నదని నిర్ణయించినా, పీని తీపోను. మిగిలిన నీరు యింకనూ 26,150 ఎకరములకు సరిపోవును. కాని ప్రస్తుతం ఈ ప్రణాళికక్రింద 20,000 ఎకరముల వరకే సాగు పండబడునున్నది. అందువల్ల నీటిసప్లై చాలినంత ఉండగలదు.

8 వ కొంటూరుకు 2 కొంటూరుకూ మధ్య ఉన్న వారు ఎంపవల్ల ఆవిరియైపోవు నష్టమునకు సరిపోగలదు. 2 కొంటూరుకు క్రిందయున్న నీరు, నావికా సౌకర్యమునకు అవసరము కాగలదు. అందువల్ల, 8.0 వ కొంటూరు క్రింద నీరు దాళ్వా నిమిత్తం ఉపయోగింప లెలపెట్టబడలేదు.

7. ఆర్థికస్థితి. ఈ ప్రణాళిక కొరకు రెగ్యులేటర్ల నిర్మాణానికి రు8.32 లక్షలు, యితర ఖర్చుల నిమిత్తం రు246,640 వెరసి రు. 1068 లక్షలగును ఈ మొత్తం మీద, స్కీమువల్ల 100 కి 5.97 ఆదాయము రాగలదు. ఈ లెక్కలు తయారుచేయడంలో నీటి తీర్వ ఎకరమునకు రు 3/-లు చొII న అంచనా వేయబడింది. ఈ ప్రాంతంలో అన్నిచోట్ల పనూలు చేయబడుతున్న నీటితీర్వ ఎకరమునకు 6/-ల రేటులో ఈ మొత్తం సగం మాత్రమే అయిఉంది. తమ పంపులు ఉండేస్థలాలనుండి కొల్లేటిలో నీరుదశే ప్రాంతాలకు ప్రతి సంవత్సరం బోదె లు వేసి కోవలసిన బాధ్యత రైతులే వహించవలసి ఉండడంవల్ల, ఈ రేటు సగం మాత్రమే వసూలు చేయడం న్యాయమని తలంచబడింది. ఈనీటి తీర్వా కాక, ఎకరానికి రు 1-6-0 మెరకసిస్తు కూడా విధింపవచ్చును.

క్రొత్తగాసాగులోకిరాగలభూమిలో చాలాభాగం ఆసెసుడు వేస్టుభూమియైయున్నది. ఈభూమి వేలంలోఅమ్మితే చాలా సొమ్ము లభింపగలదు. కాని ప్రస్తుతం తయారుచేసిన అంచనాలో ఈ మొత్తం పరిగణనలోనికి తీసికోబడలేదు.

| | |
|---|---|
| పనుల నిమిత్తం ఖర్చు | 822,000 |
| డైరక్టు, ఇన్‌డైరక్టుఖర్చులు | 246,640 |
| మొత్తం ఖర్చు | 10,68,640 |
| 20000 ఎకరాల ఆయకట్టు మీద ఎకరానికి రు. 3/- చొII న వచ్చే నీటి తీర్వ | రు. 60,000 |
| ఎకరానికి 1-6-0 చొII న మెరకభూమి శిస్తు | రు. 27,500 |
| | రు. 87,500 |
| వసూలు ఖర్చులు, 100 కి 5 చొII న 4375 పోషణవ్యయం,ఎకరానికిరు.1/-చొII 20000 | రు. 24375 |
| నికరాదాయం | రు. 63,125 |

అనగా 100 కి 5.97.

### ఈ ప్రణాళికలోని ప్రత్యేక విశిష్టత

1. ఈ ప్రణాళిక క్రింద ఎకరమునకు రు. 50/-ఖర్చుతో భూమి సాగులోనికి వస్తుంది. ఆంధ్రరాష్ట్రములో గాని, భారతదేశంలోగాని యింత తక్కువ మొత్తంతో భూమిని సాగులోనికి తీసికొనివచ్చే ప్రణాళిక లేనేలేదని చెప్పవచ్చును.

2. ఆదాయం విషయంలోకూడా ప్రస్తుతంవేసిన అంచనాలనుబట్టి యే 100 కి 5.97, లేక 6 చొII న ఆదాయం రాగలదని తేలుచున్నది. ప్రస్తుతం అమలులో ఉన్నట్టిగాని, ఆలోచనలో ఉన్నట్టిగాని ఏ ప్రణాళిక పైనాయింత హెచ్చు ఆదాయము వచ్చే అవకాశం లేదు.

ఇంతేకాక నీటి తీర్వ ఎకరానికి రు. 4/- చొప్పున వేసినా రైతులు సంతోషంతో యివ్వగలరు. ఆ ప్రకారంచేస్తే మరో రు 19000 (రు. 20000-వసూలు ఖర్చు రు 1000) ఆదాయం రాగలదు. అపుడు నూటికి 7.68 ఆదాయం రాగలదు.

3. ఈ ప్రాజెక్టుకు ఎవరికీ నష్ట పరిహారం యివ్వనక్కరలేదు.

4. యితర ప్రాజెక్టుల క్రిందవలెగాక ఈ ప్రాజెక్టువల్ల సాగుక్రిందకు రాగల భూమిలో 100 కి 90 వంతులు ప్రభుత్వముదే యైయున్నది. ఈ మొత్తం సరాసరి కొనుక్కునేవారికి వేలంవేస్తే గాని, లేక యే 10 సంII లు కౌలుకు గాని యిస్తే మొత్తం ఈ స్కీముకయ్యే ఖర్చుకు మించిన మొత్తం రాగలదు.

5. ప్రస్తుతం కొల్లేటివంటి మంచి నీటి సరస్సు మన రాష్ట్రంలో ఎచ్చటాలేదు. కాని, ప్రతిసంవత్సరం కొల్లేటిలోని నీరు పూర్తిగా ఎండిపోవడంవల్ల చేపల పెరుగుదల అభివృద్ధికి అవకాశం లేకపోతున్నది. ప్రతి సంవత్సరం మొత్తం చేప లక్ష్మీ నశించి, తిరిగి క్రొత్తగా నదులకాల్వలనుండా కొత్త చేప రావలసి వస్తోంది. అదీ తిరిగి పూర్తిగా ఎదిగే అవకాశంలేక హరించిపోతున్నది. ఈ ప్రణాళిక అమలు జరిగితే సంవత్సరంపొడుగునా కొల్లేటిలో కొంతప్రాంతం నీరు నిలవఉంటుంది. కనుక చేపలు పూర్తిగా వృద్ధిఅగుటకు అవకాశాలు హెచ్చుగా ఉన్నవి. వానిమీదకూడ ప్రభుత్వానికిఅధికమైన ఆదాయం వచ్చుటయేగాక, ప్రజలకు సరిపైన రక్షకాహార ఉత్పత్తి (Protective food production) అధికంకాగలదు.

6. ఇతరప్రాజెక్టు లన్నిటి క్రిందా సాగుచేయవలసిన భూములలో మెరక పల్లములు, రాళ్ళు రప్పలు, అడవులు మొదలైనవి ఉంటాండడంవల్ల ప్రాజెక్టులు పూర్తియైన చాలాకాలమునకు గాని, ఆ ప్రాజెక్టుక్రింద సాగుకు తీసికొని రావలసిన భూమి సేద్యంజరగడం లేదు. ఉదాహరణకు మెట్టూరుప్రాజెక్టు నిర్మాణమై ఎంతోకాలమైనా ఇంకా సాగుకురావలసిన భూమి అంతా రాలేదు. తుంగభద్ర ప్రాజెక్టువిషయంలో కూడా ఇట్టివార్తలే యిటీవల ప్రకటింపబడినవి.

కాని యీ స్కీముక్రింద భూమి, ఎట్టి నిమ్నోన్నతములు లేనిదీ, స్వభావసిద్ధంగా, నదుల ఒండ్రుమట్టి, నీటిలో జీవించే కలువ, నాచు, జమ్ము, జిలుగ మొదలైన వృక్షజాతులు కుళ్లుటవల్ల ఏర్పడిన సారవంతమైన భూమిఅవటం వల్లా, రెగ్యులేటరు నిర్మించిన మొదటి రెండుసంవత్సరాల లోనే పూర్తిగా సాగులోనికి రాగలదు.

ఈ 20,000 ఎకరాలలోనూ కనీసం 8 లక్షల బస్తాలధాన్యం అనగా 15 వేల టన్నుల బియ్యం పండే అవకాశం వున్నది. ఈ బియ్యం అంతా, యితర రాష్ట్రాలకు ఎగుమతిచేసే బియ్యమైయున్నది. అనగా రు 11 లక్షలు ఖర్చు చేసినందువల్ల ఆంధ్రరాష్ట్ర ఉత్పత్తి 57 లక్షలు పెరుగగలదు.

ఇన్ని విశిష్టతలుగల యీ ప్రాజెక్టు ఎవరిదృష్టికీ రాకపోవడం, ఆంధ్రుల దురదృష్టం అనకతప్పదు. ఇప్పటి కయినా ప్రభుత్వమూ, ప్రజా ప్రతినిధులూ యీ ప్రణాళిక విశిష్టతను గుర్తిస్తారని ఆశిస్తున్నాను.

# 'ఆజాద్ కాశ్మీర్'లో పోటీగా కొత్తప్రభుత్వ స్థాపన

## 'ముస్లింసభ' వారు ఏర్పాటుచేసినట్లు వార్తలు

శ్రీనగర్, ఆగస్టు 3: పాకిస్తాన్ ఆక్రమణలో వున్న కాశ్మీరులో పాక్ ప్రభుత్వం ఆమోదించి ఏర్పాటుచేసిన ప్రభుత్వానికి పోటీగా ఇంకో ప్రభుత్వాన్ని "ముస్లింసభ" వారు ఏర్పాటు చేసినట్లు ఇచ్చటకు చేరుతున్న వార్తల వల్ల తెలుస్తున్నది.

ఈ ప్రభుత్వాధినేతగా రాజామహమ్మద్ హైదర్ ఖాన్‌ను యీ కొన్నరెస్సువారు నియమించారు. ఈ ప్రభుత్వాన్ని గుర్తించకుండా, తాము తమ నెత్తినరుద్దిన ప్రభుత్వాన్నే పాకిస్తాన్ బలపరచడానికి నిశ్చయించుకున్నట్లయితే, ప్రజలను తాము పాకిస్తాన్‌తో సహకరించవద్దని కోరగలమని హెచ్చరించారు.

పాకిస్తాన్ ప్రభుత్వం యీ కొన్నరెస్సు వారి యీ కోర్కెను, ప్రజల అభిమతాన్ని మన్నించకుండా "ఆజాద్ ప్రభుత్వం" అధ్యక్షుడు తాము చెప్పినవ్యక్తిని ఎన్నుకో వలసిందిగా జిల్లాబోర్డువారిని ఆదేశించింది. ఈ ఆదేశంపట్ల ప్రజలు ఆగ్రహాన్ని చెంది, వ్యతిరేకప్రదర్శనలు చేసి, హర్తాళ్ లు జరిపి, తమ అసమ్మతిని తెలియజేశారు. పాక్ ప్రభుత్వం యీ ఆక్రమిత కాశ్మీరులో అన్నిప్రాంతాల్లోను 144 సెక్షన్ను అమలుజరిపింది. అనేకమందిని అరెస్టుచేసింది. అ పైన ముస్లింకాన్ఫరెన్సు వారు సమావేశమై, పోటీప్రభుత్వాన్ని నెలకొల్పి, దాన్ని గుర్తించవలసిందని పాకిస్తాన్ ప్రభుత్వానికి హెచ్చరికలు అందజేశారు.

## అమెరికా సూచన: ఆసియా రాజ్యాల నిరాకరణ

(1 వ పేజీ తరువాయి)

పక్షం" అని కమ్యూనిస్టు నాయకుడు కొయిక్ మర్ విమర్శించారు.

స్వతంత్ర సభ్యుడు సుందరలింగం ప్రధానిని అమెరికా తాబేదారు అని నిందిస్తూ, ఆయన కమ్యూనిజాన్ని గురించి లోగడ ఏమిచెప్పిఉన్నా, గత కొలంబో సమావేశంలో ప్రకటించిన తటస్థ సూత్రాలదృష్ట్యా తన అభిప్రాయాలను సవరించుకోవలసి వున్నదన్నారు.

తన వ్యక్తిగతాభిప్రాయాలుయేమిటి అని కొంతేలవలను సభ్యుడు అడిగ్గా ఆయన ఈ విధంగా జవాబిచ్చారు.

"కమ్యూనిస్టులను నిర్మూలి అంటే వాళ్లు తమ చిత్తశుద్ధిని క్రియద్వారా నిరూపించాలి. ప్రపంచంలో అమెరికా ఒక్కటే ఇతరుల మీద ఆధారపడనిదేశం అమెరికనులు ప్రజాస్వామ్యాభిమానులు. యుద్ధాన్ని నివారించటంకోసం వాళ్లు తమ ధనం అంతటినీ వెచ్చించటానికి సిద్ధంగా ఉన్నారు.

### సింహళ వర్గాల ఆశ్చర్యం

ఈడెన్ ప్రతిపాదనను పురస్కరించుకుని మళ్ళీ కొలంబో దేశాల సమావేశాన్ని ఏర్పాటు చేయాలని సింహళ ప్రధాని ప్రయత్నిస్తున్నందుకు సింహళ రాజకీయ వర్గాలు నేడు విభ్రాంతి చెందినవి. ఏప్రిల్ సమావేశంలో ప్రకటించిన తటస్థ విధానం విషయమై కొలంబో రాజ్యాల్లో అభిప్రాయ భేదాలు ఉంటేనే తప్ప, రక్షణ ఒప్పందాలను గురించి ఇప్పుడు మరొక సమావేశం జరిపే అవసరమే లేదని వాళ్లు భావిస్తున్నారు. ఆ విధానాన్ని మార్చవలసిన అవసరమేమీ ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితులలో ఏర్పడలేదని కూడా వాళ్లు భావిస్తున్నారు.

సింహళ ప్రధాని ఎత్తులో చాలా దాగి వున్నదని ప్రతికూల పక్షాలేకాక, ప్రభుత్వపక్షంలో కొందరు కూడా భావిస్తున్నారు. బర్మా, సింహళాలు ఆగ్నేయాసియా ఒప్పందంలో చేర వచ్చునని వాషింగ్‌టన్ నుంచి వచ్చిన వార్తలు వీళ్ల అనుమానాలను బలపరుస్తున్నవి.

### బర్మా మౌనం

సెప్టెంబరులో కొలంబో దేశాల సమావేశం జరపాలని సింహళం దగ్గర నుంచి తమకు ఇంకా ఎట్టిప్రతిపాదనా అందలేదని నేను రంగూనులో బర్మా ప్రభుత్వోద్యోగి ఒకరు వెల్లడించారు. ఆగ్నేయాసియా రక్షణ ఒప్పందం విషయమై బర్మా వైఖరిని గురించి అడిగ్గా ఆయన జవాబివ్వలేదు.

బర్మా స్వయంగా ఆ వ్యవస్థలో చేరకపోయినా, ఆ వ్యవస్థను ఇతరులు నెలకొల్పకుండా ప్రతిఘటించదని మాత్రం రంగూన్ వర్గాలు సూచిస్తున్నారు.

సింహళం దగ్గర నుంచి ఇటీవల కొన్ని సందేశాలు పాకిస్థాన్ ప్రభుత్వానికి అందినట్లు నేడు కరాచీలో తెలియవచ్చింది.

## రైల్వే భోజనశాలల్లో భోజనాలు: ఖరీదులు

### రైల్వేబోర్డు నిర్ణయం

న్యూఢిల్లీ, ఆగస్టు 3: రైల్వేబోర్డు వారు రైల్వే భోజనశాలల్లో భోజనం ఏయే పదార్థాలతో కూడి వుండాలో, దాని ఖరీదెంత వుండాలో నిర్ణయించి సెప్టెంబరు 1 వ తేదీనుంచీ యీ ప్రమాణాలను అమలు జరపబోతున్నారు.

దీనిప్రకారం దక్షిణరైల్వేలో పగటి భోజనం-అన్నం, పప్పు, కూర, పచ్చడి, కూటు, సాంబారు, రసం, మజ్జిగ, ఊరగాయ లేక చట్నీ, ఒక అప్పడం, రెండుగరిటెలు నెయ్యిలో కూడి వుంటుంది. దీని ఖరీదు భోజనశాలలో అయితే 0-10-0. రైలులోకి అందించటమయితే 0-13-0. రాత్రిపూట భోజనం-అన్నం, కూర, పచ్చడి, ఊరగాయ లేక చట్నీ, ఒక అప్పడం, 2 గంటలు నెయ్యి, సాంబారు, రసం, మజ్జిగతో కూడివుంటుంది. ఖరీదు మార్పులేదు. పెరుగు కావాలంటే అదనంగా 0-2-0 ఇవ్వాలి. అదనంగా ఒక తీపిపదార్థమూ, ఒక కారపు పదార్థముతో ప్లేటుగాని, కారియర్ లోగానీ ఇచ్చే స్పెషల్ భోజనం 1-4-0 కు లభిస్తుంది.

బొంబాయి, తూర్పు, సెంట్రల్, పడమర, ఉత్తరరైల్వేలలో శాకాహార భోజనశాలలో అయితే 0-14-0 కూ, రైలులో అయితే 1-0-0 కీ లభిస్తుంది. మాంసాహార భోజనశాలలో 1-2-0 కూ, రైలులో అయితే 1-4-0 కీ లభిస్తుంది. శాకాహారభోజనం-పప్పు, కూర, పెరుగు లేక రెండుకూరలు, 4 చపాతీలు, ఒక ప్లేటు అన్నం, చట్నీ, ఒక అప్పడంతో కూడివుంటుంది. మాంసాహార భోజనంలో పప్పు, లేక మాంసం లేక చేపలకూర లేక కోడి గుడ్డు, 3 చపాతీలు లేక 4 చపాతీలు ½ ప్లేటు అన్నం, ఒక పచ్చడీ కూడ వుంటుంది. వేరే ఏమైనా కావాలంటే విడిగా తెప్పించుకోవచ్చు.

# సంపాదకునకు లేఖలు

## భూసంస్కరణలు "రైతు" నిర్వచనం

ఆర్యా, భూమిసంస్కరణలగురించి ఆలోచించినపుడు రైతుయొక్క నిర్వచనమేమో ముందుగా నిర్ధారించుకొనుట చాల యవసరము. వ్యవసాయదారులందరూ రైతాంగము క్రింద పిలువబడుచున్నారు. స్వయంగా భూమిని కౌలుకు చేస్తున్నవారిని, లేదా అజ్మాయిషీక్రింద పనిచేయిస్తున్నవారిని మొత్తంమీద రైతని వ్యవహరించడం మన ఆచారమైయున్నది.

ఇందులో (1) కౌలుకు చేయడం వలన రైతని వ్యవహరింపబడుచూ, 100 ఎకరములు ఇంకా పైగాను గూడా స్వంతభూమిగల వారున్నారు. (2) సందసైగా ఎకరాలు కౌలుకు చేయుచూ, ఆదిలో ఏదియు లేకపోయినను, కౌలుకు చేయడం మొదలుపెట్టాక, భూస్వామందుకన్న ఎక్కువ భూమిని సంపాదించిన వారున్నారు. (3) ఎన్నాళ్ళు చేసినను ఒక్కచిక్కని కరింతో, బోలెడం తయిందలో, పెరిగే సంసారంలో శాశ్వత బాధపడుతున్నవాళ్లు ఉన్నారు. అయితే ప్రభుత్వం తలపెట్టిన యీ భూసంస్కరణల్లోని ఆదర్శం, ఆర్థిక సమానత్వాన్ని సాధించడానికి ప్రయత్నించేయడమే!

పరిస్థితులిటులుండగా, పైన ఉదహరించిన, రకరకాల రైతులనిపించుకొనేవారిలో, ఎవరికి మనం అనుకొనే రక్షణనీయాలి! ఎవరినట్లు నిర్వచించాలి? అనునది ఆలోచింపవలెను.

భూసంస్కరణలు వచ్చి భూప్రమాణం నిర్ణయించబడినపుడు పైన ఉదహరించిన మొదటి రెండు తరగతుల వారు సంస్కరింపబడతారు. ఇక మూడవతరగతి బీదరైతుస్థితి నిజంగా చూడవలసినది. అందుకు, 10 ఎకరముల పైబడిన స్వంతభూమిగలరైతు, ఇతరుల భూమిని కౌలుకు పుచ్చుకొనుటకు అనర్హుడుగా నిర్ణయించడం, ఏ ఒక్కరైనా కౌలుకుచేసే భూప్రమాణం 10 ఎకరములకు మించకుండా చూడడం, కొంతవరకూ ఉపకరించగలవు.మరిన్నీ-కౌలుదార్ల రక్షణబిల్లులో, భూస్వామందు ఒకవేళ పెద్దరైతుని తప్పించి, బీదరైతుకి తన భూమిని మరిస్తే ఆ రక్షణబిల్లు బీదరైతుకే అనుకూలంగాఉండే లాగ చూడడము చాలా ముఖ్యము.

ఈలాటి ముఖ్యవిషయములను దృష్టియందుంచుకొని పనిచేసినచో,సంస్కరణలయొక్క ఆదర్శము సువిధిగా సాధింపవీలగును.

కాకినాడ, మునుగంటి శ్రీరామమూర్తి.

* * *

## బిళ్లలవలస గ్రామ హరిజనులస్థితి

ఆర్యా, చీపురుపల్లి తాలూకాలో బిళ్ళలవల్స అధిక సంఖ్యాకులైన హరిజనులున్న గ్రామం. అన్ని కుటుంబాలు చాలా పేదవి. నిరుపేద వ్యవసాయకూలీలుగా, పాలికాపులుగా రైతులుగా కలిగిందానితో కడుపునింపుకొంటూ అర్ధాకలితో అలమటిస్తున్న యీ హరిజనులను చూసే దాతలేడు.

ఇదే గ్రామములో 80 ఎకరముల బంజరుభూమి నిరుపయోగముగా అనేక సంవత్సరాలనుంచి పడియుంది. హరిజనులకు, బంజర్లు యిస్తామని ప్రభుత్వము ప్రకటించడంతో దరఖాస్తులు పెట్టుకున్నారు హరిజనులు. అధికారుల ధర్మమాఅని అన్ని బుట్టదాఖలు అయ్యాయి. 7 ఏండ్లనుండి చేస్తున్న ప్రయత్నమేమీ ఫలించలేదు. కడకు యీమధ్య ఎస్టేటు మేనేజరుగారితో 24-6-54 తేదీన బంజరుభూమివిషయంలో మనవిచేయగా పిటిషన్‌లు తీసుకొని తను పోయాయిచ్చారు. ఎస్టేటు తహసీలుదారు వారిని జూలై 3, 4 తేదీలలో ఆ గ్రామంపోయి దరియాప్తుచేసి తగు చర్యతీసుకోమని మూడు దుటచే చెప్పారుగాని నేటివరకు యిటువంటి యాప్తులేదు. హరిజనుల పిటిషన్లపై తగు విచారణ తక్షణంచేయించి భూమి మంజూరుచేయించాలనికోరుతున్నాను.

బిళ్ళలవల్స, జి. వి. నరసింహారాజు.

* * *

## క్రైస్తవ సంఘమునకు విజ్ఞప్తి

ఆర్యా, 1-8-1954 నుండి 8-8-54 వరకు అఖిల భారత వెనుకబడినజాతుల కమీషన్ అధ్యక్షులు శ్రీ కాకా కలేల్కర్ గారు ఆంధ్రదేశమున పర్యటన చేయనున్నారు. గాన క్రైస్తవసంఘముల వారు నెల్లూరు, కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి విశాఖ జిల్లాలలోని క్రైస్తవులు వ్యక్తిగతముగాను, సంఘములద్వారాను, విజ్ఞప్తులద్వారాను క్రైస్తవుల కష్టనిష్ఠురములను అభివృద్ధికి తగు మార్గములను సూచించుచూ ఆయా జిల్లాలలో వారినిదర్శించి, క్రైస్తవుల విద్యా, వైజ్ఞానిక, సాంఘిక అభివృద్ధికి మార్గములను స్వయంగా తెలుపవలసినదిగాను, అభివృద్ధి విషయములలో హరిజనులకిచ్చు ప్రత్యేకతలను క్రైస్తవులకు కూడా వర్తించునటుల చేయవలసినదిగా కోరవలసినదిగాను విజ్ఞప్తి చేయుచున్నాను.

ఆప్పికట్ల జోసఫ్.

* * *

## స్కూల్ ఫైనల్ సాంఘిక శాస్త్ర గ్రంథం

ఆర్యా, 1954-55 వ సంవత్సరపు ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు ప్రొఫెసరు ఎం. వెంకటరంగయ్య, శ్రీ ధన్యరాజు అప్పారావు, శ్రీ నంపటి పురుషోత్తం మొదలగువారిచే రచించబడిన త్రివిధములైన సాంఘికశాస్త్ర పాఠ్యగ్రంథములను తమ యిష్టానుసారముగా అనేక స్కూల్సువారు తమకు తోచిన పుస్తకమును నిర్ణయించారు. ఇందువలన పరీక్షకు తర్ఫీగు పొందుతున్న విద్యార్థులకు కొన్ని యిబ్బందులు వచ్చినవి. కారణ మేమనగా పై పేర్కొనబడినవారిచే రచింపబడిన యీపాఠ్యగ్రంథాలలో (ఒకే సిలబసు అయినప్పటికి) ఒకరు వ్రాసిన పుస్తకములలోని పాఠ్యాంశములు కొన్ని, మరొకరు వ్రాసిన పుస్తకములలో లేవు.

ఉదాహరణకు, శ్రీవిక్టోరియామహారాణి ప్రకటనాంశములు శ్రీ వెంపటి పురుషోత్తంగారి రచనా గ్రంథములో వుండగా, శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారి గ్రంథములో లేవు. రేపు పరీక్షలో విక్టోరియా మహారాణి ప్రకటనాంశములను పేర్కొనమని ప్రశ్నించిన, "ఏమి చేయుదుమా?" అని చాలా మంది విద్యార్థులు ఇప్పటినుండే భయపడుచున్నారు. ఇది నేను ఉదాహరణకు మాత్రమే పేర్కొనుచున్నాను. అలానే కొన్ని పాఠములలోకూడా ఇటువంటి మార్పులే గలవు. అంతేగాక శ్రీ ఎం.వి. రంగయ్యగారి గ్రంథములో పాఠ్యాంశములు సులభగ్రాహ్యముగా, విపులముగా, క్రమపద్ధతిలో లేవు. దీనివలన తమతమ పుస్తకాలలో లేని అనేకప్రశ్నలు(బిట్ క్వెశ్చన్స్) గా నైనాసరే వస్తే, ఏమి చేయుదుమా? అని చాలామంది విద్యార్థి, విద్యార్థినులు వ్యాకులత చెందకపోవుట లేదు.

ప్రభుత్వమువారు రీవిధముగా, కలగలపుగా, త్రివిధములైన పాఠ్యగ్రంథములను నిర్ణయించుట శోచనీయము.

విజయవాడ: సరగడ సూర్యరాజు రెడ్డి.

* * *

## నర్సాపురం ఇనుప కార్ఖానా కార్మికులు

మహాశయా, పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపురం పట్టణంలో సుమారు 40 ఇనుపపనిముట్లు తయారుచేసే కార్ఖానాలు, 200 మంది కార్మికులున్నారు. యుద్ధకాలంలో రైతాంగానికి కావలసిన వ్యవసాయపు పరికరాలు, తదితర సామగ్రి విరివిగా తయారయి, తూర్పుగోదావరి, కృష్ణాజిల్లాలకు ఎగుమతులు జరుగుతుండేవి. రానురాను పనులులేక నిరుద్యోగంతో మేము అనేకఅవస్థలు పడుతున్నాము.

ఇనప కార్ఖానాలు అనగా ఒక్క పూర్వపుపనిముట్లు మాత్రమే ఒక రవుతాయనే భావం చాలామందికి ఉన్నది. కాని యిది శాస్త్రీయంగా తగిన ఆర్థికసహాయంతోబాటు, సహకారం కూడా వుంటే కొరినైపుణ్యం చూపగల శక్తి లేకపోలేదు.

బ్రిటిషు హయాంలో భారతదేశం చేతివృత్తులను అభివృద్ధికాకుండా అణచిపెట్టిన సంగతి జగద్విదితమే.

చేతివృత్తులను రక్షించుటే పరమాశయం అన్న నేటి జాతీయ ప్రభుత్వ హయాంలో కూడా రక్షణ మృగ్యమయింది. తగినరక్షణలేక అనేకమంది కార్మికులం నిరుద్యోగానికి గురికావలసి వస్తుంది. నైపుణ్యంగల కార్మికులు అజ్ఞాతంగా వుండిపోవలసి వస్తుంది. కార్మికులు చాలామంది తరుచు పస్తులతో గడిపే ఘటనలనేకం వున్నాయి.

ప్రభుత్వం దీనిని ముందుగానే గమనించి తగు రక్షణకల్పిస్తే యింత ప్రమాదం జరగకుండా వుండేది. ఇప్పటికయినా ప్రభుత్వం గమనించి తక్షణం అప్పులరూపేణా ఆర్థికసహాయం చేసి, తర్వాత పరిశీలనసంఘాన్ని విషయసేకరణకై ఏర్పాటుచేసి తగురక్షణ కల్పించాలి.

తర్వాత కో-ఆపరేటివ్ సొసైటీయు స్థాపించి మాకు ఆర్థికసహాయంజేయుట ద్వారా సొసైటీలలో తయారయిన వ్యవసాయపు పనిముట్లు, తదితరపరికరాలు ప్రభుత్వం అగ్రికల్చరల్ ఆఫీసులకు సప్లయిచేయుటద్వారా మాకు పనికల్పించి, మా నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటకు ప్రభుత్వం పూనుకుంటుందని ఆశిస్తున్నాము.

వంక నరసింహారావు, ఇనుపఖార్ఖానా కార్మికుడు, నర్సాపురం.

## కర్నూలు ఆదివాసులకు ప్రభుత్వ సహాయం

కర్నూలు, ఆగస్టు 3: కర్నూలు జిల్లాలోని ఇరవై 'చెంచు' కుటుంబాలకూ, నలభై 'సుగాలీ' కుటుంబాలకూ గృహనిర్మాణానికి కావలసిన వస్తువులను ఉచితంగా సరఫరా చేయటానికి ప్రభుత్వం నిశ్చయించింది.

కొండజాతుల సహకార సంఘాలకు రేసెనంటి చిన్న అడవి పరిశ్రమలను కౌలుకు ఇచ్చే ప్రతిపాదనను కూడా ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

## రాజకుమారి అమృతకౌర్

సికింద్రాబాదు, ఆగస్టు 3: యూనియన్ ఆరోగ్యమంత్రి రాజకుమారి అమృతకౌర్ రేపు 7 వ తేదీనాడు ఇక్కడికి రానున్నట్లు తెలుస్తున్నది.

# ఫ్రాన్సు నిష్క్రమణ తథ్యమేనని పుదుచ్చేరి వర్గాల ధృవీకరణ

## అధికారం అప్పగించకుండా వైదొలగే అవకాశం: ఢిల్లీ, పారిస్‌వర్గాల వైఖరి

పుదుచ్చేరి, ఆగస్టు 3: ఇండియాలోని ఫ్రెంచి వలసలను వదలిపెట్టి ఫ్రాన్సు నిష్క్రమిస్తుందన్న వార్తలపట్ల పారిస్‌లో ఫ్రెంచి విదేశాంగశాఖ భారత రాయబారి కార్యాలయంకూడా మౌనం వహించి, తమకేమీ తెలియదన్నప్పటికీ, ఈ వార్తలను పుదుచ్చేరిలో ఉన్నతాధికారులుమాత్రం ధృవీకరించారు. గవర్నరు మెనార్డ్‌కు పారిస్‌నుంచి ఉత్తరువులు వచ్చినవనీ, వివిధ శాఖోద్యోగులను పిలిపించి గవర్నరు తనకు చేరిన ఉత్తరువుగురించి వారికి తెలియచేశారనీ, ఆగస్టు 7 లోగా, అది తప్పితే 13 వ తేదీలోగా ఇక్కడి ఫ్రెంచి అధికారుల కుటుంబాలు మూటాముల్లె సర్దుకుని తప్పకుండా బయలుదేరగలరనీ ఈ అధికారులు నిర్ధారణగా చెప్పారు.

పారిస్‌లో విదేశాంగశాఖ భారత రాయబార కార్యాలయాల మౌనంపై అక్కడి రాజకీయవేత్తలు వ్యాఖ్యానిస్తూ ఫ్రాన్సు ఆర్థిక సంస్కరణలూ, యూరప్ రక్షణ వ్యవస్థ, ఉత్తరాఫ్రికాలో ఉద్రిక్త పరిస్థితులూ మొదలైన వ్యవహారాలను ఫ్రెంచి ప్రభుత్వం పరిష్కరించుకునేవరకూ, ఇండియాలోని వలసలనుంచి నిష్క్రమణ వార్తపట్ల మౌనంగా ఉండాలని ఇరువర్గాలూ కూడబలుక్కుని, ఈ వైఖరి అవలంబించినట్లనిపిస్తున్నదని అన్నారు.

### నిదర్శనలు

వలసలనుంచి ఫ్రాన్సు వైదొలగడం నిజం అనడానికి నిదర్శనలు పుదుచ్చేరిలో పుష్కలంగా కనిపిస్తున్నవి.

పుదుచ్చేరి ప్రభుత్వ ఉద్యోగులకు ఈ నెలకు కావలసిన జీతాలూ భత్యాలూ గురువారంనాటికల్లా లెక్కకట్టవలసిందని పుదుచ్చేరి ఖజానాకు ఉత్తరువులు ఇవ్వబడినట్లు విశ్వసనీయంగా తెలుస్తుంది.

ఫ్రెంచి ఉద్యోగులు క్రిందటి నెల అందుకున్న జీతాలపై రాబడిపన్ను వసూలు చేయబడలేదు.

గత మూడు నాలుగు రోజులుగా ఇక్కడి ఫ్రెంచి యూరపియన్ ఉద్యోగులు తమ దగ్గర ఉన్న కరెన్సీనోట్లతో, అవసరంగా బంగారమూ, నగలూ కొనివేస్తున్నారని ఇక్కడి వర్తకులే చెప్పారు. కరెన్సీ వదుల్చుకుని, బంగారు జాగ్రత్త పెట్టుకుంటే, రేపు ఇక్కడినించి పోవలసివచ్చినా బెంగ ఉండదు. కాబట్టే వీళ్లు ఇలా చేస్తున్నారని వర్తకులు చెప్పుతున్నారు.

పారిస్‌వర్గాలు నిష్క్రమణ వార్తలను ఖండించాయన్న వార్తని ఇక్కడి ఫ్రెంచిఉద్యోగులే ఖాతరు చెయ్యటంలేదు. ఇప్పుడు ఖండిస్తున్నా, మొత్తంమీద ఈ వలసల సమస్యపై ఇండియాతో తిరిగి సంప్రతింపులు జరపడానికి ఫ్రాన్సు ఇదివరకే ఇచ్ఛ వ్యక్తపరచింది. కాబట్టి, నిష్క్రమించడం ఎలాగా తప్పదని వీరు భావిస్తున్నారు.

పోతే ఇక్కడి ఫ్రెంచిఅధికారుల కుటుంబాలు వెళ్లిపోడానికి ఒకటి రెండు రోజులలో ఓడ వస్తుందని విశ్వసనీయంగా తెలిసింది. వాళ్లందరూ పెట్టే బేడా సర్దుకుంటున్నారు కూడా.

### అధికారం అప్పగింత: ఫ్రాన్సు వైఖరి

విముక్తవలసలలో విమోచనం చేయబడిన ప్రాంతాలపై అధికారాన్ని ముందుగా అప్పగిస్తామనీ, మిగతా ప్రాంతాలగురించి దరిమిలాను సంప్రతించుకుని ఒప్పందం చేసుకుందామని భారత ప్రభుత్వానికి ఫ్రాన్సు లోగడ ప్రతిపాదించింది.

ఈ చీలికలూ, పీలికలుగా పుచ్చుకోడానికి భారతప్రభుత్వం అంగీకరించలేదు. వలసలన్నిటినీ పూర్తిగా ఒప్పగించాలని తను మొదటునుంచి అనుసరించిన విధానాన్నే పునరుద్ఘాటించింది. ఆప్రకారం ఏ విమోచనమైన వలసలలో ప్రమేయం పెట్టుకోలేదు.

పోతే, ఇక ఈ పుదుచేరి కారైకాల్ వలసలలో పరిస్థితులు తమకు ప్రమాద హేతువులుగా పరిణమిస్తున్నవని ఫ్రెంచివారు గ్రహించారు. ఈ రెండువలసలలోనూ స్థానికసంస్థలన్నీ ఎదురుతిరిగాయి. వర్తకులూ, న్యాయవాదులూ, ప్రభుత్వోద్యోగులుకూడా, భారతదేశంతో విలీనాన్ని కోరుతున్నారు. వేల కొద్దీ వలంటీర్లు ఈ రెండు వలసలను చుట్టూ కొని, [illegible] వున్నారు. వీళ్లు ఏ క్షణానయినా వలసలపై దాడిచెయ్యవచ్చు. లోపలా బయటాకూడా పరిస్థితులు ఎదురు తిరిగినందువల్ల ఫ్రాన్సు వైదొలగడం తప్పనిసరిఅయింది.

వదలి వెళ్లి వచ్చుడు, వీటిపై అధికారాన్ని ఫ్రాన్సు ఎవరికి అప్పగిస్తుందన్న ప్రశ్న సర్వత్రా [illegible] ఉదయిస్తున్నది.

అధికారం ఎవరికీ అప్పగించకుండా వలసలను అరాజకంగా వదిలేసే మార్గాన్ని చేపట్టాలని ఫ్రాన్సు సంకల్పిస్తున్నదని ఇక్కడ భావించబడుతున్నది. ప్రజలమీద పగ తీర్చుకోడానికి ఫ్రాన్సుకనక ఇలాచేస్తే ఈ వలసలని భారత ప్రభుత్వానికి ఒప్పగించడానికి ఎవరూ ఉండరు. [illegible] ప్రభుత్వానికి [illegible]

ఫ్రాన్సు ఇలాచేయటానికి [illegible] నికి ఒక కారణం ఉంది. వలసలను స్వయంగా తమ భారతప్రభుత్వానికి అప్పగిస్తే, పరిస్థితుల వత్తిడికి ఇక్కడ ఇలా చేసింది కాబట్టి, ఇతర దేశాలలోని మిగతా ఫ్రెంచి వలసలుకూడా ఈ దారాన్నే వర్తించవచ్చుననే భయం.

ఫ్రాన్సు హఠాత్తుగా వెళ్ళిపోయి వలసలను శూన్య ప్రాంతాలుగా, వదిలేస్తే ఏం జరగాలనే విషయమై అధికారంలోఉన్న పుదుచ్చేరి రాజకీయవాదులు వాడుకగా సమాలోచనలు సాగిస్తున్నారు.

అధికారాన్ని ఎవరికి ఇచ్చిపోరాదనీ, ఇండియాలో చేరికకు ఇంత ఆరాటపడ్డ తమ వాంఛను మన్నించి, ఇండియాప్రభుత్వం తన ఉదాసీనతను వీడి, ఈ వలసలను అరాజకంపాలు కాకుండా కాపాడి చేపట్టాలని ఇక్కడ ప్రజాబాహుళ్యం అభిప్రాయం వ్యక్తపరచబడుతున్నది.

### విద్యార్థుల గైరు హాజరు

కారైకాల్, ఆగస్టు 3: ఆగస్టు 10 వ తేదీనాటికి కారైకాల్ ఇండియాలో విలీనం కావాలని నేడిక్కడ జరిగిన హర్తాళ్‌ను బలపరుస్తున్నట్లు ప్రకటించడానికి ఇక్కడి సెంట్ మేరీస్ హైస్కూలుకీ, మోడరన్ కాలేజీకీ చెందిన విద్యార్థులు చాలా మంది తరగతులకు వెళ్లలేదు.

విలీనోద్యమానికి ప్రజల సహాయం సమీకరించడానికై ఒకటవ తేదీనుంచీ నిరాహారదీక్ష పూనిన సెత్తూర్ గ్రామపు విద్యార్థులు ఐదుగురినీ దీక్ష విరమించవలసిందనీ, రాజకీయ చర్యల సంఘ కార్యదర్శి లోకనాథన్ విజ్ఞప్తి చేశారు.

ఆగస్టు 15 నాటికి కారైకాల్ విముక్తి పొందగలదని ఆయన హామీ ఇచ్చారు.

### వార్తా పత్రికలు

కారైకాల్‌పై ఇటుపై వచ్చే వార్తాపత్రికల బంగీలను మొదట పోలీసు శాఖకు అందచేయాలనీ, అధికారులు ఆ పత్రికలు చూచి, ఆమోదించిన తరువాతనే, వాటని ప్రజలకు విడుదలచేయాలనీ ఉత్తరువులు జారీ చేయబడినవి.

## వెనుకబడిన ప్రజలకు బేసిక్ విద్య

### శ్రీ కాకా కలేల్కర్ అభిభాషణ

కర్నూలు, ఆగస్టు 4: "సత్యమైన బేసిక్ విద్య వెనుకబడిన తరగతుల ఆర్థికాభివృద్ధికే కాకుండా, క్రొత్త నాయకత్వానికి వారికి సమర్థతను చేకూర్చగలదని భావించబడుతోంది. అందువల్లనే, బేసిక్ విద్యాభివృద్ధిని పరిశీలించటానికి ఆత్రత పడుతున్నాం."

"యీనాటి సాంఘిక సమస్య, ముప్ఫయివిస్కునాటి సమస్యవంటిది కాదు. క్రొత్త శక్తులు క్రొత్త సమస్యలను, క్రొత్త అవకాశాలను సృష్టించాయి. కనుక, సంఘసేవకులూ, ప్రజామంత్రివర్గాలు ప్రస్తుత సాంఘిక సంబంధాల దృష్ట్యా పరిస్థితిని పునః పరిశీలించాలని విజ్ఞప్తి చేస్తున్నాం" అని వెనుకబడిన తరగతుల కమిషన్ అధ్యక్షుడు శ్రీ కాకాసాహెబ్ కలేల్కర్ నిన్న ఇక్కడ పత్రికా ప్రతినిధులతో అన్నారు. శ్రీ కాకా కలేల్కర్ మాట్లాడుతూ హరిజనుల, గిరిజనుల, ఇతర వెనుకబడిన కులాలవంటి వెనుకబడిన ప్రజలపట్ల, ప్రస్తుత ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ విధానం సానుభూతితోనే ఉన్నదనే విషయం తనకు నచ్చిందనీ, కమిషన్ కార్యక్రమానికి అధికారులు అన్నివిధాలా తోడ్పడ్డారనీ, మంత్రులు కూడా చర్చలలో దాపరికం లేకుండా మాట్లాడారనీ అన్నారు.

మామూలుగా ప్రతిరాష్ట్రంలోనూ మా పర్యటన పరిసమాప్తిఅయినతర్వాత అధికారులతోనూ, మంత్రులతోనూ చర్చలు జరపటం మా విధానమనీ, అయితే ఆంధ్రరాష్ట్రం విషయంలో పర్యటనకుముందే చర్చలు జరపటం జరిగిందనీ, దీనివల్ల కూడా కొన్ని లాభాలు ఉంటవనీ, అధికారులనుంచి లభించిన సమాచారం, మంత్రులు అనుసరించేవిధానం దృష్ట్యా రాష్ట్ర పరిస్థితులను మేము పరిశీలించ వీలవుతుందనీ వివరించారు.

నేతివృత్తిమీద జీవించేకులాల విజ్ఞప్తులను తీసుకొనే అవకాశం కలిగిందనీ, రేపు మరింతగా ప్రతినిధివర్గాలను కలవటం జరుగగలదని ఆశిస్తున్నామనీ, ఆ తర్వాత కమిషన్ రెండు జట్లుగా ఏర్పడి ఒకరు చిత్తూరువైపు, రెండవ జట్టు విజయవాడవైపు వెడుతుందనీ తెలియజేశారు.

రాష్ట్రగవర్నర్ శ్రీ త్రివేదీతో కూడా దీర్ఘచర్చలు జరిపామనీ, వెనుకబడిన ప్రజలపట్ల ఆయనకుగల సానుభూతి విదితమేననీ అన్నారు.

### జిల్లాల పర్యటనకు కమిషన్ పయనం

వెనుకబడిన తరగతుల కమిషన్ రాష్ట్ర పర్యటనలోని ప్రథమఘట్టం పూర్తిఅయింది. జిల్లాలలో పర్యటించటానికి ఇవాళ కమిషన్ రెండుజట్లుగా ఏర్పడింది. ఈ ఉదయం మరి కొంత మంది ప్రతినిధివర్గాలను కలుసుకున్న తర్వాత, అరుణాంగ్షుదే, చౌరాసియా, అబ్దుల్ ఖ్యాఇమ్ అన్సారీ, పి. జి. షా గారలతో కూడిన జట్టు పాసెంజర్ రైలులో అనంతపురంకు బయలుదేరి వెళ్లింది.

కాకా కలేల్కర్, రాజేశ్వరపటేల్, కజ రోల్కర్, భీకాభాయ్ గారలతో కూడిన వర్గం విజయవాడకు బయలుదేరి వెళ్లింది.

### కర్నూలులో కమిషన్ కార్యక్రమ వివరాలు

కమిషన్ సభ్యులు 3-వ తేదీ పుదయం రాజభవనంలో గవర్నరును కలుసుకుని చర్చలు జరిపారు. తర్వాత రాష్ట్ర మంత్రులతోనూ, అభివృద్ధి శాఖా కార్యదర్శితోనూ ప్రధాన సెక్రేటరియట్‌లో చర్చలు జరిపారు.

రాష్ట్రంలోని వెనుకబడిన తరగతుల పరిస్థితులనూ, వారికి ఇవ్వబడుతున్న ప్రత్యేక సదుపాయాలను కమిషన్ తెలుసుకున్నారనీ, వాటిని గురించి చర్చించారని భావించబడుతోంది.

రాష్ట్రంలోని దాదాపు సగం జనాభా వెనుకబడిన తరగతుల క్రిందకే వస్తుందనీ, ప్రభుత్వోద్యోగాలలో నూటికి 40 వంతులు వారికే ప్రత్యేకించబడ్డాయనీ, ఈ రిజర్వేషన్ కాక, తెలివితేటలనుబట్టికూడా వారికి స్థానాలు ఉన్నాయని తెలపబడిందట. విద్యాసౌకర్యాల నిమిత్తం దాదాపు 6 లక్షల రూపాయలు కేటాయించబడిందని యీ ప్రత్యేక ఏర్పాటు ప్రత్యేక సదుపాయాలకేనని తెలపబడింది.

వెనుకబడిన తరగతుల జాబితాలో మరికొన్ని కులాలను చేర్చేవిషయంలో ప్రభుత్వాభిప్రాయాన్ని కమిషన్ అడిగిందని భావించబడుతోంది.

## నర్సాయపాలెంలో కమ్యూనిస్టుల బెడద

### "ప్రజాకోర్టు" స్థాపనద్వారా ప్రజల పీడన

### ప్రభుత్వానికి విజ్ఞప్తి

కర్నూలు, ఆగస్టు 3: కమ్యూనిస్టులు సాగిస్తున్న అత్యాచారాలను గురించి గుంటూరుజిల్లా నరసాయపాలెం గ్రామస్థులు సంపూర్ణా ఒక విజ్ఞప్తిని ప్రగడ కోటయ్య (యం. యల్. ఏ), కాచిన సుబ్బారావు గార్లు న్యాయమంత్రి టి. విశ్వనాథంగారికి సమర్పించారు.

నరసాయపాలెంలోని కమ్యూనిస్టులు ప్రజాకోర్టు అంటూ ఒకటి ఈ మధ్యనే స్థాపించారనీ, తమ పక్షాన్ని బలపరచని రైతులపై 140 మొదలు 400 రూ. ల దాకా దారుణమైన జుల్మానాలు వేసి కట్టిమంటున్నారనీ, జుల్మానాలు చెల్లించని వారి వారి పనిపాటలు మానుకోనీకుండానూ, వారి వారి ఇండ్లనుంచి కదలనీకుండా చేస్తున్నారనీ, కొందరిని కస్టడీలోకి తీసుకొని తమ పేరట బలవంతంగా ప్రామిసరీ నోట్లు వ్రాయించుకొంటున్నారనీ, గ్రామ జనాభాలో మూడువంతులు కమ్యూనిస్టులూ వారి బలగమేననీ, శాంతిభద్రతల బాధ్యతఅంతా వారే తీసుకొని, తమను కొందన్నవారిని చంపుతాం, కొట్టుతాం అని బెదిరిస్తున్నారనీ, ఈ అరాచకాన్ని అణచివేసి ఆ ప్రాంతాల ప్రజా సౌభాగ్యం యొక్క ఆస్తులనూ, అసువులనూ రక్షించడానికి తగిన చర్యలు ప్రభుత్వం వెంటనే తీసుకోవాలనీ ఆ విజ్ఞప్తిలో పేర్కొనబడింది.

ఈ సందర్భంలో వారు ప్రధాన కార్యదర్శి ఫుల్లారెడ్డిగారిని [illegible] ప్రభుత్వం ఈ విషయమై గమనించాలని కోరారు.

[illegible] పేర్కొనబడిన కొందరు రైతులను గత 16 వ తేదీనాడు [illegible] పోలీసు [illegible] రనీ, ప్రస్తుతం వారు అక్కడే ఉంటున్నారనీ, [illegible] పలువురు గ్రామంనుంచి తప్పించుకొని పారిపోయి బాపట్ల, చీరాలవంటచోట్ల దాచుకొంటున్నారనీ ప్రగడ కోటయ్యగారు పత్రికా విలేఖర్లతో చెప్పారు.

## ఆంధ్రరాష్ట్రంలో అమలు జరిపే రెండవ పంచవర్ష ప్రణాళిక

### — అక్టోబరునాటికి సిద్ధం

కర్నూలు, ఆగస్టు 4: అక్టోబరునాటికల్లా ఇక్కడ జరుగనున్న రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శుల సమావేశంలో ఆంధ్ర రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా సంపుటీకరణ జరుగుతుందని ఇవాళ అధికారరీత్యా చెప్పబడింది. దీనిని రాష్ట్ర ప్రభుత్వం పరిశీలించినమీదట, ప్లానింగ్ కమీషన్‌కు సమర్పిస్తుంది.

రాష్ట్ర ఉన్నతోద్యోగుల రెండు రోజుల సమావేశం ముగిసేముందు, నిన్న ఈ నిర్ణయాన్ని తీసుకోవటం జరిగింది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికక్రింద అమలుజరిగే ప్రాజెక్టుల, సమాజవికాస కార్యక్రమాల, జాతీయవిస్తరణ కేంద్రాలలో జరుగుతున్న కృషిని సమీక్షించటానికీ, రెండవ ఆంధ్ర ప్రణాళికను రూపొందించటానికీ ఈ సమావేశం ఏర్పాటయింది. నిన్న ఉదయం జరిగిన ఆఖరి సమావేశానికి గవర్నర్ సి. ఎమ్. త్రివేదీ అధ్యక్షత వహించారు. రాజధానిలోఉన్న రాష్ట్ర మంత్రులు చర్చలలో పాల్గొన్నారు.

రెండవ ప్రణాళికా స్వరూప విధానాన్ని శ్రీ త్రివేదీ సూచించారు.

తిరిగి రాష్ట్రప్రభుత్వ కార్యదర్శులు సమావేశమయేనాటికి రెండవ జాతీయ ప్రణాళిక ఏర్పాటు స్పష్టపడగలవని తెలుస్తున్నది.

## గ్రామసీమలో రోడ్ల అభివృద్ధికి ఆర్థిక సహాయం

### కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన 3 లక్షల గ్రాంటు

### జనాభానుబట్టి జిల్లాలకు విభజన

("ఆంధ్రపత్రిక" విలేఖరి)

కర్నూలు, ఆగస్టు 4: రాష్ట్రంలో గ్రామస్థుల సౌకర్యార్థం గ్రామాలను సమీప పెద్ద రహదారులకు కలుపుతూ గ్రామాలనుంచి రోడ్లనిర్మాణానికి ప్రధానంగా ఉద్దేశింపబడిన 3 లక్షల రు కేంద్ర ప్రభుత్వ గ్రాంటులో నూటికి 75 వంతులు జనాభా ప్రాతిపదికగా అన్ని జిల్లాలకు పంచబడింది. మిగిలిన 25 వంతుల మొత్తాన్ని వెనుకబడిన, క్షామ ప్రాంతాలుగా గుర్తించబడిన రాయలసీమ నాల్గు జిల్లాలకూ, నెల్లూరు, గుంటూరుజిల్లాలలోని మెట్టతాలూకాలకూ, ఏజెన్సీ ప్రాంతాలకూ గాను రిజర్వు చేయబడింది.

ఈ క్రింది విధంగా ఆయా జిల్లాలకు మొత్తాలు కేటాయించుటం జరిగింది.

(1) శ్రీకాకుళం రు 23625, (2) విశాఖపట్టణం రు 24225, (3) తూర్పు గోదావరి రు 28200, (4) పశ్చిమ గోదావరి రు 19500, (5) కృష్ణా రు 19350, (6) గుంటూరు రు 40650, (7) చిత్తూరు రు 35625, (8) నెల్లూరు రు 27900, (9) అనంతపురం రు 28200, (10) కర్నూలు రు 30675, (11) కడప రు 22050 లు.

గ్రామస్థుల సహకారంతో గ్రామాల రోడ్లఅభివృద్ధి, పెంపుదలకు ఈ మొత్తాలు ఉద్దేశించబడ్డాయి. గ్రామాలను సమీప సబ్‌రోడ్లతోనూ, పెద్ద రోడ్లతోను కలపటానికి ఈ ప్రణాళిక ఉద్దేశించబడింది. ఈ ప్రధానావసరాలకు ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. వెనుకబడిన ప్రాంతాలపట్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు.

జిల్లాల కలెక్టర్లు డివిజనల్ ఇంజనీర్లతోనూ, తదితర అవసర సంస్థలతోనూ సంప్రతించిన మీదట ఏ పనులు జరపాలో నిర్ణయిస్తారు. 10 వేల రు దాటని ఎస్టిమేట్లను కలెక్టర్లే మంజూరు చేసే అధికారం కలిగి ఉంటారు. ఈ మొత్తానికి మించిన ఎస్టిమేట్లను ఛీఫ్ ఇంజనీరు (హైవేస్) ద్వారా ప్రభుత్వానికి ఆమోదం నిమిత్తం పంపుతారు.

గ్రామస్థులు ఇచ్చే సహాయం రొక్కరూపంలో గానీ, లేదా, వస్తురూపంలో గానీ, లేదా స్వచ్ఛంద కాయకష్టం ద్వారాగానీ లేదా భూదానరూపంలో గానీ ఉండవచ్చు. ప్రతి పనికయ్యే ఖర్చులో కనీసం ఈ సహాయం మూడవవంతైనా ఉండాలి. ఈ రెండు వంతుల భాగంలో పంచాయితీవంటి స్థానిక సంస్థల వాటా కూడా ఉండవచ్చు. అయితే, ఆపనికయ్యే మొత్తం ఖర్చులో స్థానిక సంస్థల వాటా 6 వ వంతుకు హెచ్చరాదు. స్వచ్ఛంద విరాళాలు గ్రామస్థుల అవసరానికి గీటురాయి కాగలవు.

మరో మూడవవంతు వాటాను రాష్ట్ర ప్రభుత్వ నిధులనుంచి ఇస్తారు. మిగతా మూడవ వంతు వాటా కేంద్ర ప్రభుత్వ గ్రాంటునుంచి ఇవ్వబడుతుంది. ప్రభుత్వం ఇచ్చే సహాయం వస్తువుల, సాంకేతిక సహాయం ద్వారా జరుగుతుంది.

ఆయా ప్రాంతాలకు సంబంధించిన పనులను స్థానిక సంఘాలకు, లేదా గ్రామస్థులకు, లేదా పంచాయితులకు ఇచ్చే విషయం కలెక్టర్లు ఆలోచిస్తారు. ఈ పనులు పూర్తయిన తర్వాత నిర్వహణ బాధ్యతను స్థానిక సంస్థలకు అప్పగిస్తారు.

అవసరమైన గ్రామాలలో సంప్రదించి కలెక్టర్లు తమ ప్రతిపాదనలను త్వరలో పంపాలని కోరబడ్డారు. ప్రభుత్వ సహాయంతో తమప్రాంతాల అభివృద్ధికి ఈ అవకాశాన్ని గ్రామస్థులు వినియోగించుకుంటారని ఆశించబడుతోంది.

### ఇండో - సోవియట్ సాంస్కృతిక సంఘం

మదరాసు, ఆగస్టు 4: ఇండో సోవియట్ సాంస్కృతిక సంఘం [illegible] అధ్యక్షుడు డా॥ ఎ. వి. బాలిగాగారు రేపు 5 వ తేదీ [illegible] నెం. 193 [illegible] సంఘ కార్యకర్తలను [illegible]

## అమెరికా, భారతదేశ వ్యాపార సంబంధాలు

### రాయబారి జి. ఎల్. మెహతా ప్రసంగం

బొంబాయి, ఆగస్టు 3: అమెరికాతో భారతదేశ వ్యాపారం ఇటీవల 7% నుంచి 25% కు హెచ్చిందని, భారత ప్రభుత్వం ఇటీవల ఏర్పాటుచేసిన టీ కౌన్సిలు మనదేశపు టీ ఎగుమతికి గిరాకీ లభించటానికి బాగా కృషి చేసిందనీ అమెరికాలో భారత రాయబారిగా వుంటున్న గగన్ విహారీలాల్ మెహతా అన్నారు.

అఖిలభారత వస్తు తయారీదారుల సంఘంవారు మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారి అధ్యక్షతను ఇవ్వాళ మెహతాకి సత్కారం చేశారు. ఆ సందర్భంలో ప్రసంగిస్తూనే ఆయన యీ విషయం వెల్లడించారు. ఇటీవల యీ రెండు దేశాల సంబంధ బాంధవ్యాలు సన్నిహితము, అధికమూ అయాయనీ, భారతీయ వణిక్ప్రముఖులు అమెరికా వెళ్ళి, ఆ దేశంవారిని ఇక్కడికి ఆహ్వానించి పరస్పరమైన సమస్యలను చర్చించుకోవాలనీ ఆయన సూచించారు. ప్రజాస్వామికంలో వాస్తవిక అభిప్రాయ భేదాలను సహించుకోవటం అవసరమన్నారు.

మన విదేశాంగనీతి అమెరికాలో బహుళాంశంగా గ్రహింపబడుతోందని కూడా ఆయన అన్నారు.

## బ్రిటిష్ గయానాలో పోలీసు సోదాలు

జార్జిటౌను, ఆగస్టు 4: సాయుధ పోలీసులు నిన్న బ్రిటిష్ గయానా అంతటా 600 మైళ్లకు మోటారు కార్లను ఆపి సోదా చేశారు. వీటిలో డైనమైట్ మొదలయిన పేలుడు పదార్థాలున్నాయేమోనని ఈ సోదాచేసినట్లు తెలిసింది. జాతీయ నాయకులు చెడీ జగన్, సిడ్నీకింగ్‌ల స్వస్థలాల్లో ఇళ్ళావాకిళ్ళూ కూడా సోదా చేశారు. ఒకచోట గుర్రపు పందెల క్లబ్బు భవనాన్ని పడగొట్టటానికి కుట్ర జరిగిందని తెలిసి, ఈ పనికి పూనుకొన్నట్లు పోలీసులు అన్నారు.

## ఆర్థిక విద్యావ్యాప్తికై యూనివర్సిటీలకు రిజర్వుబ్యాంకు ప్రత్యేక సహాయం

బొంబాయి, ఆగస్టు 3: పరిశ్రమల సహాయానికి యేర్పడిన "ఫైనాన్స్ కార్పొరేషన్" "రాష్ట్ర ఫైనాన్షియల్ కార్పొరేషన్ల" వాటాలను, బాండ్లను, గవర్నమెంటు సెక్యూరిటీలవలెగానే పరిగణించడానికి రిజర్వుబాంకు వారు నేడు ఆమోదించారు.

ష్రాఫ్ కమిటీవారు వ్యష్టిఆర్థిక రంగాన్ని గూర్చి చేసిన సిఫార్సులలో యిది ఒకటి. దీన్ని ఆమోదిస్తూ నేడు రిజర్వుబ్యాంకువారు యీ ప్రకటన చేశారు.

### విశ్వవిద్యాలయాలకు సహాయం

దేశంలో కొన్ని కొన్ని విశ్వవిద్యాలయాలలో ఆర్థికశాస్త్ర అభ్యాసానికి గాను మూడు ఆచార్యపీఠాలను నెలకొల్పటట్లు చేయడానికి, ఆ ఆచార్యపీఠాల నిర్వహణానికి తగిన ఆర్థికసహాయాన్ని ఇవ్వడానికి రిజర్వుబ్యాంకు కేంద్రబోర్డువారు నిర్ణయం చేసుకున్నారు. ఈ నిర్ణయాన్ని అనుసరించి రిజర్వుబ్యాంకు గవర్నరు శ్రీ బి. రామారావు బొంబాయి విశ్వవిద్యాలయం [illegible] ఆర్థికాచార్యపీఠాన్ని నెలకొల్పవలసిందని, అందుకుగాను నెలకు 25 వేల రూపాయలను రిజర్వుబ్యాంకువారు [illegible] పడినారని తెలియజేశారు.

### బుడమేటి వరదలు: రాకపోకలకు ఆటంకం

మదరాసు, ఆగస్టు 4: కృష్ణా జిల్లాలో కేసరపల్లి ఇందుపల్లిలవద్ద బుడమేరులో విశేషంగా ప్రవాహం ఉండటంచేత యిరుప్రక్కలనుండి రాకపోకలు బంద్ చేయబడియున్నవి.

### మద్రాస్ యూనివర్సిటీ పరీక్షా ఫలితాలు

మదరాసు, ఆగస్టు 4: మదరాసు యూనివర్సిటీ బి. యస్. యస్. సి. డిగ్రీ (2 వ భాగం) కుయరోగచికిత్స పట్టము, ఆర్థికశాస్త్రంలో పట్టము, రాజకీయములు ప్రజాపాలనములో పట్టము సంఘ సంక్షేమసేవ పరీక్షల ఫలితాలు రేపు 5 వ తేది పత్రికలలోను యూనివర్సిటీ భవనమునందును ప్రచురింపబడగలవు.

### రాజభవన్ వార్తలు

కర్నూలు, ఆగస్టు 4: ప్రచారోద్యమ శాఖా డైరెక్టరు శ్రీ ఎస్. దక్షిణామూర్తిగారు ఇవాళ ఉదయం గవర్నరును రాజభవన్‌లో కలుసుకున్నారు.

# దయ్యూను దగ్ధపటలం చేయందే పోర్చుగీసువారు కదలరట

## గవర్నరు బెదిరింపు: డామన్‌పైకి రెండురోజులలో వలంటీర్ల యాత్ర

### రెండువారాల్లో దాడిని పూర్తిచేసే సంకల్పం

రాజకోట, ఆగస్టు 4: "దయ్యూనుంచి పోర్చుగీసు వారిని బలవంతాన బయటకు వెళ్లగొట్టినట్లయితే, తాము భూదగ్ధ విధానం మొదలుపెట్టగలమనీ, పోతూపోతూ దయ్యూ పట్నానికి నిప్పుపెట్టి మరీ పోతామనీ దయ్యూ, గవర్నరు అక్కడ జరిగిన ఒక పౌరసభలో బెదరించాడని ఇక్కడికి వార్తలు వచ్చినవి.

విమోచన దళాలకు చేయూత ఇవ్వవద్దనీ. అలా చేస్తే అది సర్వనాశనానికి దారి తీయగలదనీ కూడా ఈ గవర్నరు దయ్యూ పౌరులను బెదిరించాడట.

### డామన్‌పైకి దాడి

సెల్వాసా, ఆగస్టు 3: మొన్న సెల్వాసాను ఆక్రమించుకున్న అజాద్ గోమంతక్ దళంవారు రెండుమూడు రోజులలో డామన్‌పైకి దాడికి బయలుదేరగలరని, ఆ దళ నాయకుడు వి. ఎస్. లావాండే నేడు విలేఖరులకు తెలియచేశారు.

సెల్వాసాలో ప్రభుత్వానికి ఈయనే పరిపాలకుడుగా నియమించబడ్డారు.

డామన్ ప్రజలు ఈ దాడిని, బలపరచడానికి సిద్ధంగా ఉన్నారనీ, రెండు మూడు వారాలలో డామన్‌ను పూర్తిగా విముక్తిచేయడం సుసాధ్యమేననీ ఆయన అన్నారు.

శాంతియుతంగా డామన్‌ను తమకు వశపరచవలసిందని డామన్ గవర్నరుకు హెచ్చరిక పంపబడిందనికూడా ఆయన చెప్పారు.

అజాద్ గోమంతకదళం సెల్వాసాలో నెలకొల్పిన క్రొత్తప్రభుత్వం ఇంచుమించుగా నాగర్ హవేలీ లంక అంతటిపైనా అజమాయిషీ సంపాదించిందనే చెప్పబడుతున్నది.

ఈ లంకలోని 10 ముఖ్యగ్రామాల పాలకులకూ, ఈ నూతనప్రభుత్వానికి బద్ధులై మెలగాలని ఆదేశించారు. ఆయుధాలూ మందుసామగ్రీ ఎవరిదగ్గరైనా ఉంటే, దాన్ని ఈ ప్రభుత్వానికి అప్పగించాలని ప్రజలకు విజ్ఞప్తిచేశారు.

### గోవా ప్రజాపార్టీకి వినతి

నాగర్ హవేలీలో గోమంతకదళం నెలకొల్పిన ప్రభుత్వమే సక్రమ అధికారయుతమైనదనీ, అందువల్ల, కమ్యూనిస్టు అజమాయిషీక్రింద గోవా ప్రజాపార్టీ విముక్తిచేసిన ప్రాంతాలపై అధికారాలను సెల్వాసాలోని గోమంతకదళ ప్రభుత్వానికి అప్పగించవలసిందని ఆ పార్టీని తాము విజ్ఞప్తి చేశామని సెల్వాసాపాలకుడూ లావాండే వెల్లడించారు.

సెల్వాసాకు 6 మైళ్ళ దూరంలో ఉన్న గోవాకరీ పెరులేకర్‌కు, వారివలంటీర్లకు ఈ విజ్ఞప్తి అందచేయబడిందని ఆయన చెప్పారు.

సెల్వాసా మాజీ పాలకులు బకాయి రెండునెలల జీతాలు చెల్లించే నిమిత్తం కొత్తపాలకులు ఇవాళ ఖజానా తెరిచి చూస్తే అందులో 40 వేల రూ|| లు మాత్రం ఉన్నాయట.

మొన్న పరారీఅయిన పోర్చుగీసు అధికారులు 1,80,000 రూ|| చేతపట్టుకుపోయారని ఇదివరకే వార్తలు వచ్చాయి.

నాగర్ హవేలీలో ఆహారధాన్యాల కొరత ఎక్కువగా ఉన్నదనీ, ఈ విషయంలో భారత ప్రభుత్వ సహాయం అర్థించి, చౌక డిపోలు ఏర్పాటు చేస్తామనీ, రేపటి రోజున ఇక్కడ ఒక పంచాయితీ నెలకొల్పుతామనీ సెల్వాసా పరిపాలకుడు చెప్పాడు. సెల్వాసాలో వార్తాప్రసార కేంద్రం ఏర్పరచబడుతుందని గోవాలో ప్రవాసంలో ఉన్నవారు ఇప్పటికే ఒక కేంద్రం నిర్వహిస్తున్నారనీ ఆయన చెప్పారు.

### పోలీసులతో వలంటీర్ల సంఘర్షణ

వాపి, ఆగస్టు 4: సెల్వాసానుంచి పారిపోతున్న కొందరు పోర్చుగీసు పోలీసులకూ, గోవా ప్రజాపార్టీ వలంటీర్లకూ ఇక్కడికి 4 మైళ్ళ దూరంలో ఉన్న రాఖోలీ అనే గ్రామంవద్ద నిన్న రాత్రి సంఘర్షణ జరిగింది.

ఈ సందర్భంలో ఇద్దరు పోలీసులు గాయపడ్డారు.

వారిని వలంటీర్లు సెల్వాసా ఆస్పత్రిలో చేర్చారు.

ఇక్కడి అజాద్ గోమంతకదళ ప్రభుత్వం ఈ పోలీసులను నిర్బంధంలో ఉంచింది.

### బర్మాపత్రిక 'నేషన్' ప్రకటన

రంగూన్, ఆగస్టు 3: 'పోర్చుగీసులు గోవా వదలి పోవాల్సిందే, ఈ విషయంలో కథ అడ్డం తిరిగి అవాంతరాలువస్తే ఆసియా అంతా ఇండియాకు అండగా నిలుస్తుంది. అని సుప్రసిద్ధ బర్మా స్వతంత్ర పత్రిక 'నేషన్' నేడు సంపాదకీయం వ్రాసింది.

పోర్చుగల్ ఇరుగుపొరుగు దేశాలలో, పోర్చుగల్‌ను బలపరచడానికి ముందుకొచ్చిన రాజ్యం స్పెయిన్ ఒక్కటే. ఈ రెండూ కలిసినా ఇండియాతో ఉజ్జీ కావు. ఇంతకీ కథే అడ్డుతిరిగితే, ఆసియా అంతా ఇండియాను ఆదుకోగలదని ఆపత్రిక వ్రాసింది.

ఫ్రెంచి పోర్చుగీసులఆర్భాటాలపట్ల ఇండియా ఓరిమి వహించి ఉన్నదనీ అది కాస్తా హరించి ఇండియా ఈవల పట్టించడితే, అప్పైన పర్యవసానాలకు [illegible] ఇండియాది అవదనీ 'న్యూలైట్ ఆఫ్ బర్మా' అనే మరో పత్రిక వ్రాసింది.

### మహాసభ నిశ్చయం

పూనా ఆగస్టు 3: ఇండియాలోని విదేశీవలసను పారతంత్ర్య బంధాలనుంచి విముక్తిచేయడానికి జరుగుతున్న ఉద్యమాన్ని హృదయపూర్వకంగా బలపరచడానికి అఖిలభారతహిందూమహాసభ నిశ్చయించినదని ఆసభ జనరల్ సెక్రటరీ వి. జి. దేశపాండే నేడు ప్రకటించారు.

హిందుమహాసభ వలంటీర్లు విమోచనోద్యమంలో చేరి పని చేస్తారని ఆయన చెప్పారు.

### బొంబై కార్మిక యూనియన్

ఇండియాలోని ఫ్రెంచి, పోర్చుగీసు వలసల ద్వీపులకు రాకపోకలు జరిపే ఓడలను బహిష్కరించడానికి బొంబై పోర్టుట్రస్టు కార్మికుల యూనియన్ నేడు తీర్మానించింది. సుమారు మూడు వేలమంది కార్మికులు ఈ యూనియన్‌లో ఉన్నారు.

### గోవాలో గూఢచారి దళాల ఏర్పాటు

బొంబై, ఆగస్టు 3: గోవాలోని పోర్చుగీసు అధికారులు అక్కడి యువకులను పోగుచేసి, వలంటీరు దళాలుగా ఏర్పాటు చేస్తున్నారట! ప్రభుత్వ వ్యతిరేకుల గురించిన వార్తలు సేకరించడానికే ఈ యువకులను వినియోగిస్తున్నారట అంతే కాకుండా, ఆయా యువకుల చుట్టపక్కాలూ, సంరక్షకులకూడా గూఢచారులుగా పనిచేయడానికి వీరిని ప్రేరేపిస్తున్నారట.

ఇక, యిక్కడ జరుగుతున్న భారతీయ వ్యతిరేక ప్రచారానికి అంతు లేదు. భారత సైనికులు నాగరహవేలీ మీదికి వలంటీర్ల వేషంలో దాడిచేస్తున్నారని గోవా పత్రికలద్వారా ప్రచారం సాగుతున్నదట.

గోవాజాతీయులను, గూండాలూ, దొంగలూ, తాగుబోతులుగా అభివర్ణిస్తూ, వారు నాగర్ హవేలీ ప్రజలను నానా హింసలూ పెట్టుతున్నారని గోవా రేడియో ప్రకటించినట్లు తెలుస్తుంది.

కాథలిక్ మతగురువులుకూడా తమ మతోపన్యాసాలలో భారతీయ వ్యతిరేక ప్రచారంచేయాలని నిర్బంధించ బడుతున్నారట.

ఇక్కడి కాన్సల్ జనరల్ వెళ్లిపోగానే, పోలీసులు చెలరేగారు. ఆ కార్యాలయానికివెళ్లి ప్రతివారినీ అరెస్టు చేసివేస్తున్నారట.

వంతెనలకింద మందుపూరించి, పేల్చివేయడానికి సిద్ధంగాఉంచడం సరిహద్దు కేంద్రాల్లో ఆయుధాలూ అవీ అమర్చుకోడం, అదనపు బలాలు ఉరికించడం మొదలైన సైనికచర్యలు చురుకుగా సాగించబడుతున్న విషయం విదితమే.

దీనితోడు, ఇప్పుడు పోర్చుగీసు అధికారులు తమ కుటుంబాలను పోర్చుగల్ పంపివేస్తున్నారట.

## డామన్‌లో రక్షణ సన్నాహాలు

### సరిహద్దులలో నీగ్రో సైనికుల సన్నద్ధం

సెల్వాసా, ఆగస్టు 4: డామన్‌లో పోర్చుగీసు అధికారులు రక్షణయేర్పాట్లు గట్టిగా సాగిస్తున్నట్లు వార్తలువస్తున్నవి. జూలై 25 న ఇక్కడిదిగిన 700 మంది నీగ్రో సైనికులను సరిహద్దుపొడుగునా నిలిపారు.

ఇక్కడిపరిస్థితులకు తట్టుకోలేక జనం తండోపతండాలుగా భారత ప్రాంతాలకు వలసపోతున్నారు. ఇప్పటికి 4 వేల మంది డామన్‌వదిలి పోయినట్లు తెలుస్తోంది. ఇక్కడ ఒక హైస్కూలులో ప్రధానోపాధ్యాయుడుగా వున్న ఎస్. యు. గలాల్ అనే ఆయనను డామన్ వదలిపొమ్మని అధికారులు ఉత్తరువు లిచ్చారు. ఇందుకుకారణం వారు తెలుపలేదట.

## భారత కాన్సల్‌జనరల్ ఢిల్లీ ఆగమనం

న్యూఢిల్లీ, ఆగస్టు 3: పోర్చుగీసు వలసలలో పరిస్థితులగురించి భారత ప్రభుత్వానికి నివేదించేనిమిత్తం భారత కాన్సల్ జనరల్ విన్సెంట్ కోయెలో నేడు ఢిల్లీకివచ్చారు. ఆయనవెంట మార్మగోవాలోని ప్రతినిధి జి. ఎ. ప్రభుకూడా వచ్చారు.

గోవాలో పరిస్థితులు చాలా ఉద్రిక్తంగానూ, ప్రమాద కరపరిణామాలకు దోహదంచేసేవిగానూ ఉన్నాయనీ, ఇటీవలి దాద్రా, నగర్ హవేలీ సంఘటనలు వీటిని మరింత తీవ్రంచేశాయనీ కోయెలో విలేఖరులకు చెప్పారు.

గోవాలో తనను హత్యచేయడానికి ప్రయత్నాలు జరిగాయని ఆయన ఒక ప్రశ్నకు జవాబిచ్చారు. అయితే దాన్నిగురించి ఆయన వ్యాఖ్య చెయ్యలేదు.

### పోర్చుగల్ ఆరోపణ

గత ఆదివారంనాడు ఢిల్లీలోని పోర్చుగీసు ప్రతినిధి కార్యాలయం ఎదట ప్రదర్శనలుజరిపిన భారతీయులు, ఆ కార్యాలయ భవనద్వారాన్ని బద్దలుకొట్టడానికి ప్రయత్నించారని పోర్చుగల్ విదేశాంగశాఖచేసిన ఆరోపణ శుద్ధఅబద్ధమని భారత ప్రభుత్వోద్యోగి ఒకరు ఖండించారు.

ఆనాటి ప్రదర్శనలు శాంతియుతంగానే జరిగినవని, ఆయన నిర్ధారణగా చెప్పారు.

## మొజాంబిక్‌లోని భారతీయులపై పోర్చుగీసు మూకల దౌర్జన్యాలు

లొరెంకో మార్క్వెస్ (పోర్చుగీసు తూర్పు ఆఫ్రికా) ఆగస్టు 2: పోర్చుగీసు వలస గోవాను ఇండియాతో విలీనం చెయ్యాలని కోరుతూ గోవా ప్రజలు సాగిస్తున్న ఉద్యమం పట్ల నిరసన తెలుపుతూ పోర్చుగీసు తూర్పు ఆఫ్రికా (మొజాంబిక్)లో గవర్నర్ జనరల్ కెప్టెన్ గాబ్రియెల్ టీక్సీరియా సభ జరిపిన ఫలితంగా ఇక్కడి భారతీయులు దారుణ దౌర్జన్యాలకు గురిఅయ్యారు.

మొజాంబిక్ రాజధాని అయిన ఈ నగరంలో భారతీయ అంగళ్లను చిందరవందర చేయడం, వారిపై నడివీధిలో దౌర్జన్యాలుజరిపి నానాహింసలు పెట్టడం సంభవించింది.

ఈ భారతీయ వ్యతిరేక ప్రదర్శనల వల్ల ధ్వంసమైన ప్రాంతాలలో ఇప్పుడు పోలీసులు గస్తీ ఉంటున్నారు.

ఈ పోర్చుగీసు తూర్పుఆఫ్రికాలో పదివేలమందిభారతీయులు ఉన్నారు.



# గుడివాడ స్తూపము

శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ

మన తెలుగుదేశంలో ఏనాడు ఒకానొకనాడు బౌద్ధక్షేత్రం గాక వదులుతుంది. ముద్దులు మూటగట్టే ముగ్ధమోహన మూర్తులతో కలకలలాడుతూ కన్నుల పండువుగొలిపే శిలాఖండాలు ఎక్కువగా గోచరిసాయి. బౌద్ధమతం ఉచ్ఛదశలో ఉన్నప్పుడు ఆంధ్రావని ప్రముఖ బౌద్ధక్షేత్రంగా ఉండేదనీ, బౌద్ధ భిక్షువులు పలువురు ఆంధ్ర బౌద్ధక్షేత్రాలను సందర్శించేవారనీ నిర్ణయంగా చెప్పవచ్చు. కాని మన దురదృష్టవశాత్తు నేడు ఆనాటి బౌద్ధస్తూపాలు భూగర్భంలోనే అణగి మణగి ఉన్నాయి. వాటిని చూచే భాగ్యం ఎన్నడు కలుగుతుందో! అట్టి స్తూపాలలో గుడివాడ స్తూపం ఒకటి.

బౌద్ధయుగంలోనే కాక హిందూయుగంలో కూడా గుడివాడ పేరు ప్రఖ్యాతులు గడించుకుంది. ఈ పట్టణము కృష్ణా జిల్లాలోని మచిలీపట్టణమునకు పశ్చిమోత్తరంగా 20 మైళ్ళ దూరంలో ఉన్నది. ప్రస్తుతం గుడివాడ తాలూకాలోనే గాక పరిసర ప్రాంతాలలో కూడా చెప్పుకోదగిన పట్టణములలో ఇది ఒకటి. ఇక్కడ బౌద్ధస్తూపం ఒకటి కలదని చరిత్ర పరిశోధకుల పరిశోధన ఫలితంగా తెలియవచ్చింది. అయితే ఈ స్తూపం భూగర్భస్థమై ఉండడం మూలాన దీని ఆకృతి విశేషాలను నిర్ణయించడానికి వీలుకాకుండా ఉన్నది. పెద్ద దిబ్బగా ఉన్న ఈ స్తూపమునకు దక్షిణ, పడమరగాను బాటలూ, తూర్పు ఉత్తరములందు కొన్ని ఇండ్లు ఉన్నాయి. అందువలన ఇక్కడ త్రవ్వకపనిని ఆరంభించడం కొంచెం శ్రమతో కూడిన పని. 1892 సంవత్సరమున త్రవ్వకం కొంతవరకు జరిగింది. పిమ్మట ఆగిపోయింది. నాటికి నేటికీ దిబ్బ దిబ్బగానే ఉన్నది త్రవ్వకం జరిగితేనే తప్ప ఈ దిబ్బకు సంబంధించిన విశేషాలు తెలియవు.

గుడివాడలో వృత్తాకారంగా ఉన్న దిబ్బ ఒకటి కలదనీ, అమరావతిలోని దిబ్బకూ దీనికి సన్నిహిత సంబంధమేమైనా ఉండవచ్చుననీ తొలిసారిగా 1870 సం॥న అప్పటి మదరాసు ప్రభుత్వంవారికి తెలియజేసిన మహానీయుడు బాస్వెల్ మహాశయుడు. మరల 1871 సం॥న బాస్వెల్ దొరగారు గుడివాడ దిబ్బవిషయంలో మదరాసు ప్రభుత్వం వారికి కొన్ని వివరాలు అందజేశారు. అటుపిమ్మట ప్రభుత్వంవారు కృష్ణా మండలంలోని స్తూపాలను సంరక్షించడానికి తగుచర్యలు తీసుకున్నారు.

బౌద్ధావశేషములైన ఈ దిబ్బలకు 'లంజ దిబ్బ' లనే వ్యవహార నామం ఏర్పడిన విషయం అందరికీ తెలిసినదే గదా! గుడివాడలోని దిబ్బకుకూడా లంజ దిబ్బ అనే పేరు ఏర్పడింది. ఐతే ఈ దిబ్బకు సంబంధించిన కథను స్థలజ్ఞులు వింతగా చెబుతారు.

పూర్వం ఒక వేశ్య ఆ దిబ్బమీద స్థిరనివాసం ఏర్పరచుకుంది. ఆమె రోజుకి ఒక్కపూట మాత్రమే భోజనము చేసేదట! అదికూడా ఆకిరిపల్లి (నూజివీడుకు సమీపంగా ఉన్న గ్రామము) ఆలయగోపురంయొక్క దీపమును చూసి కాని భుజించేది కాదట. అంత నైతికనిష్ఠ ఆమెది. ఆదిబ్బమీదనే ఆమె చాలాకాలం నివసించిన కారణంవల్ల కాలక్రమమున ఆ దిబ్బను లంజదిబ్బ అని వ్యవహరించ సాగారట. ఈకథ నిజమో అబద్ధమో ఖచ్చితంగా తేల్చి చెప్పలేము.

గుడివాడ దిబ్బ వృత్తాకారంగా ఉన్న కారణమును పురస్కరించుకొని స్తూపంకూడా వృత్తాకారంగా ఉండవచ్చుననీ, భట్టిప్రోలు స్తూపాకృతిని తలపించుచున్నదనీ పరిశోధకుల విశ్వాసం. ఎర్రగా కాలినట్టి పెద్ద పెద్ద రాళ్లతో ఇది నిర్మించబడినట్లు భావింపబడుతున్నది. నేటికిని వర్షాకాలంలో దిబ్బపై ఉన్న మట్టి తొలగిపోయి స్తూపం రాళ్లూ, రాతి పెంకులూ బయటపడతాయి. అప్పుడప్పుడు ఏవో గీతలు, బొమ్మలుగల రాతి పెంకులు కనబడుతూ ఉంటాయని స్థలజ్ఞులు పేర్కొంటున్నారు. బందరు, విజయవాడల మధ్య బాటను నిర్మించిన సందర్భంలో ఈదిబ్బ నుంచి పెద్ద పెద్ద రాళ్లు తీయబడినవట. ఒకానొకప్పుడు పరను పనిత్రింగా గణింపబడిన యీ స్తూపం దుదకీ విధంగా ఉపయోగించింది. ఇక్కడ ఒక రాతిపెట్టె దొరికిందనీ, అప్పెట్టెలో రత్నమూ, బంగారు రేకూ మొదలైనవి ఉన్నట్లు స్థలజ్ఞులు స్పష్టం చేశారనిపరిశోధకులు పేర్కొన్నారు.

తర్వాత 1878 సం॥లో సుప్రసిద్ధ చరిత్రపరిశోధకుడూ, చిరస్మరణీయుడూ అయిన సీవెల్ దొరవారు గుడివాడ దిబ్బను దర్శించి ఇది సాంచీ స్తూపంవలె కన్పిస్తున్నదని నుడివిరి. కాని సాంచీ స్తూపచిహ్నలేమీ లేవని మరొకరు పేర్కొనిరి. నిశ్చితం మీద ఈస్తూపం చాలా ప్రాచీనమైనదనే చెప్పవచ్చు.

గుడివాడకు పడమరగా లాముపాడు దిబ్బ అనే ఒక దిబ్బ ఉన్నది. ఆ ప్రాంతమున పూర్వం తొంభైతొమ్మిది ఆలయములూ, తొంభైతొమ్మిది తటాకములూ ఉన్నట్లు తెలియవచ్చింది. అక్కడ ఆంధ్ర సాతవాహన రాజులకు సంబంధించిన సీసంనాణాలు లభించినవి. వాటిని సీవెల్ దొరగారు చక్కగా పరీక్షించి పై అభిప్రాయాన్ని వెల్లడించారు. కొన్ని నాణాలు పై గోతమీపుత్ర (గౌతమీపుత్ర) సిరి (శ్రీ) సతకణ (శాతకర్ణి) వాసిటోపు (వాసిష్ఠీపుత్ర) మొదలైన రాజులపేర్లు ఉన్నాయట. చైత్యము, సింహము, నాగసర్పము, అర్ధచంద్రుడు, గుఱ్ఱము మొదలైన బొమ్మలుకూడా కొన్నిటిమీద ఉన్నాయట. ఇంకొక ముఖ్యవిశేషమేమంటే సీవెల్ దొరవారికి ఒక రోమనునాణెంకూడ దొరికిందట. దీనిని బట్టిచూడగా గుడివాడ అతిపురాతనమైన పట్టణమనీ, విదేశాలతో కూడా వర్తకవాణిజ్యాలు సాగిస్తూవచ్చిన ప్రసిద్ధ వర్తకస్థలమనీ చెప్పవచ్చు. ఈ నాణాలేకాక, మూడు లేక నాలుగు అడుగులు వ్యాసంగల పెద్దకుండలూ, ఎముకల కవచములూ, కొన్ని అస్థిరకాలూ మున్నగునవి లభించాయి. హిందూదేవాలయమైన భీమేశ్వరస్వామివారి ఆలయంలో జైనవిగ్రహం ఒకటి దొరికింది. అది జైనవిగ్రహం కాదనీ, మునేశ్వరస్వామి విగ్రహమనీ అర్చకులు చెబుతారు. కాని నేడు గుడివాడలో జైన దేవాలయం ఒకటి ఉన్నది. అది పార్శ్వనాథస్వామి గుడి. దీపావళి సందర్భంలో ఆ ఆలయం మనోజ్ఞంగా అలంకరించబడుతుంది; వైభవోపేతంగా ఉత్సవం జరుగుతుంది.

భీమేశ్వరస్వామివారి ప్రశంస చేయబడింది కాబట్టి ఆదేవుని పేర్కొంటూ ఒక ప్రాచీన కవిచెప్పిన పద్యాన్ని ఈ సందర్భంలో ఉదాహరించడం సముచితంగా ఉంటుంది.

"వలనుగ వాత్మలోన గుడి
వాడపురాధిపు భీమలింగనిం
దలఁచి, కరంబులెత్తి ప్రము
దంబున మ్రొక్కి నుతించి, భక్తిని
శ్చలమతి నివ్వటూరి పుర
శాసను మగ్గురు మల్లికార్జునిన్
గొలిచి తదాజ్ఞచే బ్రకట
కోమల కావ్యకళావిశేషస్"——

విజయనగర సమ్రాట్టగు తుళువ వీర నృసింహరాయలవారి పరిపాలన కాలంలో ఉన్న మాడయ్య అనే కవి వ్రాసిన మైరావణచరిత్ర-మందలిది పై పద్యం. మాడయ్యకవి కృష్ణాతీరము వాడనీ, గుడివాడపురమందలి భీమేశ్వర స్వామివారి భక్తుడనీ, వీరశైవ మతావలంబకుడనీ చెప్పవలసి ఉన్నది. ఈపద్యము ను బట్టి గుడివాడ భీమేశ్వర స్వామివారు చాలా ప్రసిద్ధులనీ తెలుస్తున్నది. ఇంకొక విషయము గుడివాడకు గృధ్రవాడ (గ్రద్ద) అని నామాంతరం ఉన్నది. ఈ పేరు ఎట్లా వచ్చిందో తెలియదు. అయితే గుడివాడ అనే పేరు ఎట్లా వచ్చిఉంటుందో కొంచెం ఊహాగానం చెయ్యవచ్చు. గుడులు (90 గుళ్లూ, 90 తటాకములు) లెక్కకు మిక్కిలిగా ఉండడం మూలాన ఈ ఊరికి గుళ్లవాడ, గుడులవాడ-అనే పేర్లు ఏర్పడి తుదకు గుడివాడ అనే పేరు ఏర్పడి స్థిరమైపోయి ఉంటుంది.

ఒకానొకనాడు వేలాది బౌద్ధముముక్షువుల్ని ఆకర్షించిన గుడివాడ స్తూపం నేడు భూగర్భంలోనే మరుగుపడిఉండడం చాలా శోచనీయం. త్రవ్వకపనిని కొనసాగించి ఈ స్తూపాకృతిని పరీక్షించడం మన విద్యుక్తధర్మం. అప్పుడు చారిత్రకంగా కొన్ని క్రొత్త విశేషాలేమైనా తెలియవచ్చు. కనుక గుడివాడ పురప్రముఖులే కాకుండా మన ఆంధ్ర ప్రభుత్వం వారుకూడ త్రవ్వకం పని కొనసాగేటట్లు చూస్తారని నా విశ్వాసం. ఇంకా ఈ స్తూపానికి సంబంధించిన విషయాలను వెలుగులోనికి తీసుకునిరావలసిందిగా పెద్దల నందరినీ సవినయంగా కోరుతున్నాను:



కర్నూలులో జూలై 31 వ తేదీన ప్రారంభమైన సహకార సప్తోత్సవాలలో అధ్యక్షోపన్యాసం చేసిన శెట్టిపాటి రామచంద్రారెడ్డి, స్వాగతం చెప్పిన ఆంధ్రరాష్ట్ర సహకార యూనియన్ అధ్యక్షుడు పి. కేశవరావు, సహకార సప్తోత్సవ ప్రసంగంచేసిన రిజిస్ట్రార్ కె. సుబ్రహ్మణ్యంనాయుడు, ఉత్సవాలను ప్రారంభించిన గవర్నర్ సి. ఎమ్. త్రివేది గారలు ఈ వరుసలో ఉన్నారు.

## మద్రాసు నగర అభివృద్ధి స్కీములు

### కొత్తగా రోడ్లకు పెట్టిన పేర్లు

మదరాసు, జూలై 3: మదరాసు నగరాభివృద్ధికి సంబంధించిన స్కీముల పేర్లు ఆ ప్రాంతాలలో నగరాభివృద్ధి బోర్డువారు రోడ్లకు పెట్టియున్న పేర్లు ప్రజలకు తెలిసేందుకుగాను దిగువ ప్రకటింపబడియున్నవి.

(1) సిల్వర్ లాడ్జి స్కీము ప్రాంతము కీల్పాకు మదరాసు.

(ఎ) ఈస్కీముప్రాంతంయావత్తూ "సిల్వర్ లాడ్జి కాలనీ" అని పిలువబడుతుంది.

(బి) రోడ్లు:—

i "ఎ ఎ" పేరు "సి ఐ టి 1 వ వీధి" అని ఉండగలదు.

"ఇ ఇ" రోడ్డు దీనిలో చేరి ఉంటుంది.

ii "బి బి" రోడ్డు పేరు "రంగనాథం అవెన్యూ" అనే పిలువబడుతుంది.

iii "సి సి" రోడ్డు "సి ఐ టి 2 వ వీధి" అవుతుంది.

iv "డి డి" రోడ్డు "సి ఐ టి 3 వ వీధి" కాగలదు.

(2) మాంబళం దక్షిణ స్కీము ప్రాంతం—ఈ స్కీము ప్రాంతం యావత్తూ "సి ఐ టి నగర్" అని పిలువబడుతుంది.

రోడ్లు:—

ఒక రోడ్డుకు యిదివరకే "మాడల్ హౌస్ రోడ్డు" అని నామకరణం చేయబడింది. దానికి ఆ పేరే ఉండగలదు.

ఉస్మాన్ రోడ్డు, మాంబళం రోడ్డులను కలిపేరోడ్డు మొదటి మెయిన్ రోడ్డు అని ఉంటుంది.

కాలువకు సమాంతరంగా ఉండే రోడ్డు "కాలువగట్టు రోడ్డు" అని పిలువబడును.

మొదటి మెయిన్ రోడ్డుకు సమానంగా ఉండే రోడ్లు రెండవ, మూడవ మెయిన్ రోడ్లు కాగలవు.

భజనకోయిల వీధితో కలసి ఉండే వీధి 4 వ మెయిన్ రోడ్డు అవుతుంది.

ఇక్కడి గోశాలకారపురోడ్డును 3 వ మెయిన్ రోడ్డుతో కలిపే వీధి 5 వ మెయిన్ రోడ్డు అనబడుతుంది.

కాలువగట్టు మెయిన్ రోడ్డుకు సమముగానడిచే ఆయిదురోడ్లకు 1 నుంచి 5 వరకు నెంబర్లుగల అడ్డరోడ్లు అని పేర్లు యివ్వబడినవి.

స్టోర్సు వెనుకనుండేరోడ్డు మాడల్ హౌస్ మెంట్సురోడ్డు కాగలదు.

మాంబళంరోడ్డునుకలిపే రెండుచిన్న రోడ్లు ఉన్నాయి. "1 వ లింక్ వీధి" "2 వ లింక్ వీధి" అని అవి పిలువబడగలవు.

స్కూలుకు దక్షిణముగానుండేరోడ్డు "స్కూలురోడ్డు."

ఒకటి, రెండు నెంబర్ల అడ్డవీధులను సమముగావెళ్లి కాలువగట్టు మెయిన్ రోడ్డుతో కలిసే వీధికికూడా యీ పద్ధతే అవలంబించబడుతుంది.

(3) మాంబేస్ రోడ్డుస్కీము ప్రాంతం—మైలాపూరు. ఈ ప్రాంతము "సి ఐ టి కాలనీ - మాంబేస్ రోడ్డు" అని పిలువబడుతుంది.

రోడ్లు:—

ఆలివర్ రోడ్డు లిపన్ వాలర్ రోడ్డు లనుకలిపే 40 అడుగుల వెడల్పుగల రోడ్డు "1 వ మెయిన్ రోడ్డు" అయి ఉండగలదు. ఈ రోడ్డు నెం. 107 నుండి 155 అనే భూభాగాలకు ప్రక్కగా పోతుంది.

దీనికి ఉత్తరంగాను నెం. 30 నుండి 92 వరకుగల భూభాగాలకు ప్రక్క ఉండేరోడ్డు 2 వ మెయిన్ రోడ్డు కాగలదు.

తూర్పునుండి పడమరవరకేగా వెళ్ళే రోడ్డు "అడ్డ వీధులు" అని పిలువబడును.

వాటికి యీ రీతిగా నెంబర్లు ఉండగలవు:

(1) నెం. 1 వ అడ్డవీధి-నెం. 155 నుండి 167 ప్లాటుల రోడ్డువరకు కలిగించి సల్లివాన్సురోడ్డుతో కలియును.

(2) "నెం. 2 వ అడ్డవీధి" నెం. 28 నుండి 36 భూభాగాలకు రోడ్డు.

(3) "నెం. 3 వ అడ్డవీధి" నెం. 43 నుండి 52 వరకు భూభాగాలకు రోడ్డు.

(4) "నెం. 4 వ అడ్డవీధి" నెం. 60 నుండి 130 వరకు భూభాగాలమీదుగా పాలిమేరకు పోయేరోడ్డు.

(5) "నెం. 5 వ అడ్డవీధి" నెం. 62 నుండి 78 వరకు భూభాగాలకు రోడ్డు.

(6) "నెం 6 వ అడ్డవీధి" నెం. 89 నుండి 98 వరకు భూభాగాలకు రోడ్డు.

ఆలివర్ రోడ్డును యీ అడ్డవీధులతో కలిపే వీధులు లింక్ వీధులని పిలువబడగలవు.

(1) మొదటి లింక్ వీధి ఆలివర్ రోడ్డును నెం 6 వ అడ్డవీధితో కలుపును.

(2) రెండవ లింక్ వీధి ఆలివర్ రోడ్డుతో నెం 4 వ అడ్డవీధిని కలుపును,

రెండవ లింక్ వీధిని నెం 4 వ అడ్డవీధితో కలుపుతూ నెం 176 నుండి 188 నివేశనాలకు రోడ్డువరకు విచ్చేవీధి "లూప్ వీధి" అనబడుతుంది.

(4) మందవల్లి వీధి అభివృద్ధిస్కీము ప్రాంతము:—ఈప్రాంతము మందవల్లి పార్కు అనబడును.

(1) మందవల్లివీధికి సమముగావెళ్ళే 40 అడుగుల వెడల్పు (బి బి రోడ్) వెస్టుసర్క్యులర్ రోడ్డు అని పిలువబడగలదు.

(2) మాదాచర్చిరోడ్డుకు సమముగా వెళ్ళే 40 అడుగుల వెడల్పు (ఎన్ఎన్) రోడ్డు తూర్పు సర్క్యులర్ రోడ్డు అవుతుంది.

(3) గ్రాడీన్ రోడ్డుదక్షిణవీధిరోడ్డులను కలిపే 60 అడుగుల వెడల్పు రోడ్డు "దక్షిణగట్టు రోడ్డు" కాగలదు.

(4) కే కే మరి యం యం అనే రెండురోడ్లలో ఒకటి "ట్రస్టుమెయిన్ రోడ్డు నెం 1" అనీ, మరొకటి "ట్రస్టు మెయిన్‌రోడ్" అనీ పిలుస్తారు.

(5) "హెచ్ హెచ్" అనే రోడ్డు "ట్రస్టు లింక్ వీధి నెం 1" అవుతుంది.

(6) "ఐ ఐ" రోడ్డు "ట్రస్టు లింక్ వీధి నెం 2 కాగలదు.

(7) దక్షిణ వీధిరోడ్డును కలిపే "ఓ ఓ" రోడ్డు "ట్రస్టులింక్ వీధి నెం 3" అనబడుతుంది.

(8) కార్పొరేషను స్కూలుకు ప్రక్కగా వెళ్లే దక్షిణ వీధి రోడ్డును కలిపే 40 అడుగుల వెడల్పు రోడ్డు "ట్రస్టు లింక్ వీధి నెం 4" అనబడుతుంది.

(9) "పి పి" రోడ్డు "ట్రస్టుక్రాస్ వీధి నెం 1" అవుతుంది.

(10) "డి డి" డిడి రోడ్డు ట్రస్టు అడ్డవీధి నెం 2 అనబడును.

(11) "ఇ ఇ" "ఇఇ" రోడ్డు ట్రస్టు అడ్డవీధి నెం 3.

(12) "యఫ్ యఫ్" రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 4"

(13) "జి జి" రోడ్డు ట్రస్టు అడ్డవీధి నెం 5"

(14) "కే కే" రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 6"

(15) "యల్ యల్" రోడ్డు "ట్రస్ట్ అడ్డవీధి నెం 7"

(16) "ఆర్ ఆర్ రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 8"

"క్యూ క్యూ" రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 9"

(18) "పి పి" "ట్రస్టు అడ్డవీధి నెం 10"

(19) "యస్ యస్" "ట్రస్టు అడ్డవీధి 11"

(20) "టి టి" రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 12"

(21) 'యు యు" రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 13"

(22) "వి వి" రోడ్డు "ట్రస్టు అడ్డవీధి నెం 14" కాగలవు.

(5) కోడంబాక్కంస్కీము ప్రాంతము:—ఇది "ట్రస్టు పురం కోడంపురం కోడంబాక్కం" అని పిలువబడుతుంది.

(6) కాప్సచేరి చింతాద్రిపేట.

రెండుభాగాల కట్టడములు "కాప్స వ్యవయారు" అనీ రెండు గ్రోణాల చిట్టియింట్లు "కాప్స కాలనీ" అనీ పిలువబడగలవు.



కర్నూలులో జూలై 31, ఆగస్టు 1 వ తేదీలలో జరిగిన భారత సహకారోద్యమ సప్తోత్సవాల ఊరేగింపు



కాళంగి రిజర్వాయరుకు 1 వ తేదీన శంకుస్థాపన సందర్భంలో జరిగిన బహిరంగసభ ఇందులో ఉపముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి లోక్ సభ డిప్యూటీ స్పీకర్ అనంతశయనం అయ్యంగార్, పి. రంగారెడ్డి, ఎల్. వెంకట కృష్ణయ్యర్ గారలు ఉన్నారు.



ఆంధ్రప్రభుత్వ వివిధశాఖల అధికారులు కర్నూలుజిల్లా ప్లానింగ్ సంఘ సభ్యులు నంద్యాలలో జూలై 31 వ తేదీన సమావేశమయినప్పటి ఫొటో.

## మలయాలోని సింహళ హైకమిషనర్

### హత్యచేస్తామని కమ్యూనిస్టు బెదిరింపు

సింగపూర్, ఆగస్టు 4: మలయాలో సింహళం హైకమిషనరుగా పనిచేస్తున్న శ్రీ పరణవితానను హత్యచేస్తామని బెదిరిస్తూ కమ్యూనిస్టులు ఆయనకు ఒక శ్రీముఖాన్ని అందజేశారు.

ఈవిషయాన్ని శ్రీ ముత్తే నేడు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ వెలడిచేశారు. అంతేగాక ఆయన మలయాలో బ్రిటిషువారి చేతుల్లో వున్న ఒక పత్రికలో "చేతనైతే నన్ను చంపండి" అంటూ కమ్యూనిస్టులకు సవాలుచేస్తూ అడ్వర్టయిజ్‌మెంటు కూడా అచ్చొత్తించారు.

## 'వేరుశనగ నూనెపై సుంకం తగ్గించాలి'

మదరాసు, ఆగస్టు 3: వేరుశనగ నూనెను విదేశాలలో మంచి వ్యాపారం జరగాలంటే ఎగుమతుల కోటా హెచ్చించినంత మాత్రాన ప్రయోజనం లేదనీ దానితోపాటు ఎగుమతి సుంకము రూ. 200 తగ్గించాలని ఇండియా ప్రభుత్వాన్ని మదరాసు నూనె వర్తకుల సంఘమువారు ఒక తంతివార్తమూలమున కోరియున్నారు.



కడవకొల్లు పంచాయతీకి అధ్యక్షుడుగా ఎన్నికైన నాదెళ్ల వెంకట సుబ్బారావుగారు.

## ఇండోచైనా సమస్యపై జినీవా ఒప్పందాలు

### కొలంబోరాజ్యాలసంతృప్తి

న్యూఢిల్లీ, ఆగస్టు 4: ఇండోచైనాలోని యుద్ధ విరమణ విషయమై జినీవాలో కుదిరిన సమాధానాలు ఆగ్నేయాసియాలో శాంతిని సుస్థిరం చేసేందుకు ఉపకరించేవిగా ఉండగలవని కొలంబో సమావేశంలో పాల్గొన్న దేశాల ప్రభుత్వాలు భావిస్తున్నవని ఆదేశాల తరఫున సింహళ ప్రధాని సర్ జాన్ కొటెలవల బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఈడెన్‌కు వ్రాశారు. ఈ సమాధానాలు ఈ దేశాలకు చాలా సంతృప్తి కలిగించాయనీ, వాటిని అవి బలపరుస్తున్నాయనీ, అంతర్జాతీయ శాంతి భద్రతల దృష్ట్యా జినీవా సమావేశంలో పాల్గొన్న దేశాలూ, ఇతరదేశాలూ ఈ సమాధానాలను రు. ఎ. తప్పకుండా పాటిస్తుందని అవి ఆశిస్తున్నాయనీ కూడా కొటెలవల వ్రాశారు.

# క్రీడారంగం

## నేషనల్ ఫుట్‌బాల్

### పంజాబ్‌పై ఒరిస్సా ఘనవిజయం

మద్రాస్, ఆగస్టు 4: ఇక్కడ జరుగుతున్న నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో నిన్న ఒరిస్సా పంజాబ్‌పై ఘనవిజయం సాధించింది. ఒరిస్సా 5 గోలులు చేయగా, పంజాబ్ ఒక్కటికూడా చేయలేకపోయింది.

ఆట మొదటినుంచీ సన్న జల్లుపడుతూనే ఉన్నది. నేల కొంత బురదగా తయారయింది. అయినప్పటికీ ఒరిస్సా జట్టు మంచి కలిసికట్టుగానూ, నేర్పుతోనూ ఆడి, బంతిని ఎటుకావాలంటే అక్కడికి పంపిస్తూ ఆడింది. చివరి క్షణాల్లో పంజాబ్ ఎదురుదెబ్బతీయాలని ప్రయత్నించింది కాని లాభంలేకపోయింది.

ఆటమొదలైన 5 నిముషాలకు ఒకటి విరామసమయానికి 5 నిమిషాలు ముందుగా మరొకటీ, రెండుగోలులను ఒరిస్సా సెంటర్ ఫార్వర్డుబదన్ మొదటి సగంలోనే చేశాడు. రెండవ సగంలో రైట్ ఇన్ అరుణ్ రెండు గోలులనూ, రైట్ అవుట్ బల్లూ ఒక గోలునూ చేశారు.

ఒరిస్సా గీతా (గోలర్) కృష్ణ (లెఫ్టుబాక్) గణేశ్ (రైట్ బాక్), అమరేంద్ర (లెఫ్టుహాఫ్), నిర్మల్ (సెంటర్ హాఫ్), మింటూ (రైట్ హాఫ్), తారిక్ (లెఫ్టుఅవుట్), బిరంజన (లెఫ్టుఇన్), బదన్ (సెంటర్ ఫార్వర్డు కాప్టెన్), అరుణ్ (రైట్ ఇన్), బల్లూ (రైట్ అవుట్).

పంజాబ్ మహేశ్ సింగ్ (గోలర్) దేవ్ మిత్తర్, సింగారాసింగ్ (కాప్టెన్) జగత్ సింగ్, రాంప్రకాశ్, జగన్ సింగ్, శామ్యూల్, జస్వాల్, సదరన్‌సింగ్, చందన్ సింగ్, రాజ్ పాల్ సింగ్.

## అస్సాంపై సర్వీసెస్ గెలుపు

దీనికిముందు జరిగిన పోటీలో సాయుధబలాలజట్టు అస్సామును 8 గోలులతో ఓడించింది. (3-0) ఈజట్టు 1 వ తేదీన డ్రాచేసి ఉన్నవి (0-0) సర్వీసెస్ జట్టులో 1 వ తేదీన అస్వస్థతవల్ల ఆడలేకపోయిన పూరణ్ బహదూర్ యీ సారి ఆడాడు.

సర్వీసెస్ తరఫున మేచ్ (కాప్టెన్) 2, ముఖర్జీ 1 గోలులు చేశారు.

సర్వీసెస్-భట్టాచార్జీ (గోలర్), పాల్, వాట్సన్, పూరణ్ సింగ్, వీర్ బహదూర్, పెరల్, జయరాం, పూరణ్ బహదూర్, లింగ్డా, మేచ్, ముఖర్జీ.

అస్సాం-హజారికా (గోలర్), దత్, ఎస్. దాస్, బి. దాస్, నియోగి ఎస్. దాస్, బర్గోహైన్, పి. మేచ్, బహదూర్, బి. బహదూర్, థాపా లాయ్.

సర్వీసెస్ జట్టు క్వార్టర్ ఫైనల్సులో హైదరాబాదుతో పోటీ చేస్తుంది.

## ఏకధాటి ఈతలో కొత్త రికార్డు

అలహాబాద్, ఆగస్టు 3: 22 ఏళ్ళవాడయిన అలహాబాద్ వాస్తవ్యుడు హాచ్. చౌరాసియా నేడిక్కడ ఒకే బిగిన ఈదటంలో అఖిలభారత రికార్డును నెలకొల్పాడు. అతడు శుక్రవారం పుదయం 8-25 కు అలహాబాద్ యూనివర్సిటీ చెరువులో దిగి నిన్న రాత్రి ఒంటిగంట 21 నిముషాలకు ఈత ముగించాడు. మొత్తం 88 గంటల 56 నిముషాలు ఈదాడు. పాత రికార్డు 44 గంటల 12 నిముషాలు.

## మద్రాసు ఆక్షేపణ: ఫెడరేషన్ తిరస్కృతి

బొంబాయిజట్టు కూ తమకూ రెండవసారి జరిగిన పోటీలో ప్రేక్షకుల కలభావల్ల ఆట 8 నిముషాలు ఆగిపోయివుండగా, రిఫరీ నిర్దేశించిన వేళ తరువాత 8 నిముషాలుమాత్రమే ఆట జరగనిచ్చారనీ, ఆరీత్యా తమకు 5 నిముషాలసేపు కాలం నష్టమైందనీ కనుక ఆ రోజు ఫలితాన్ని పరిగణించక మళ్ళీ ఆట ఆడనివ్వాలనీ మద్రాసుజట్టు ఆక్షేపణ తెలిపినట్లు తెలుస్తోంది. మద్రాసు జట్టు తమది అయివుండటం, తామే పోటీల నిర్వాహకులుకూడా అయివుండటంమూలంగా మద్రాసు ఫుట్ బాల్ అసోసియేషన్‌వారు ఈ అంశాన్ని అఖిలభారత ఫుట్‌బాల్ ఫెడరేషన్ వారికి తెలియచేశారట. వారు ఆట ఎందుకు ఎంతసేపు ఆగిపోయిందో రిఫరీకి బాగా తెలిసే అవకాశం వుంది కనుక, వృథాఅయిన కాలాన్ని కూడ దీయటం అవసరమూ కాదా, అవసరమయితే అదనంగా ఎంతసేపు ఆడనివ్వాలి అన్నదికూడా నిర్ణయించవలసింది ఆయనే అనీ అందుచేత ఆయన నిర్ణయానికి తిరుగులేదనీ, కనుక ఈ ఆక్షేపణనిలవ పట్టదనీ కాబట్టి మళ్ళీ ఆట అనవసరమనీ తేల్చినట్లు తెలిసింది.

## 8 కాళ్ల సూకరం

రాయదుర్గం, ఆగస్టు 3: రాయదుర్గం నెశేపేటలో కుంబారకుంట వద్ద 3 తలలు 8 కాళ్లుగల ఒక పందిపిల్లపుట్టి కొన్ని గంటలైనతరువాత చనిపోయింది. (స్వ. వి.)

# రేడియో

శుక్రవారం, ఆగస్టు 6

విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) నకలె 7-30 మద్రాసు నకలె 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1 (బి) నకలె 1-30 (ఎ) నకలె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2 (బి) నకలె 2-15 ఉన్నతపాఠశాల విద్యార్థులకు.

సా॥ 4 ప్రాథమిక పాఠశాలలకు 5-30 గోపెళ్ళ రామమూర్తిశాస్త్రి 6 సంగీతశిక్షణ 6-15 ప్రాంతీయ వా॥ 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామ కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 రంగులరాట్నం 7-30 రత్నద్వయం నాటిక కొత్త సూర్యనారాయణ 7-45 ద్వారం వెంకటస్వామినాయుడు (వ) దండమూడి రామమోహనరావు (మృ) 9 ఆంగ్లమున వా॥ 9.15 వాద్యబృందము 9-30 (బి) నకలె 9-50 భజన్ (8) 10 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 స్వాగతం 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా॥ 7-30 ఎస్. రాజాంబాళ్ 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 12-30 పాఠశాల (త) 1-30 (8) 1 40 హిందీ వా॥ 1-50 (8) 2-0 తమిళ వా॥ 2-10 కి నకలె. 2-15 పాఠశాల (త.)

సా॥ 4-0 పాఠశాల (త) 4-30 పాశ్చాత్య సంగీతం (8) 5-30 ఎ. రుక్మిణి సంజీవి 6-0 ఆంగ్ల వా॥ 6-15 ప్రాంతీయ వా॥ 6-25 త్యాగరాజస్వామి వీణ 7.0 పెరియపురాణ కీర్తన 7-15 తమిళ వా॥ 7-30 (8) 7-45 విజయవాడనకలె. 9-0 ఆంగ్లవా॥ 9-15 ప్రసంగం (ఆం) 9-30 ఢిల్లీనకలె. 10-30 ప్రసారసమాప్తి.

మద్రాస్ (బి)

ఉ॥ 7-0 తెలుగు వా॥ 7-15 నాదస్వరం 7-30 ఎ నకలె.

మ॥ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలలకు 1-0 (8) 1-30 ఆంగ్ల వా॥ 1-40 (8) 1-50 తెలుగు వా॥ 2 నకలెన్ 2-15 ఉన్నత పాఠశాలలకు.

సా॥ 4-0 ప్రాథమిక పాఠశాలలకు 4-30 ఎ నకలె. 5-30 ఎ నకలె. 6-15 ప్రాంతీయ వా॥ 6-25 లలిత గీతము, ఇవటూరి చెల్లాయి, గిడుగు భారతి-రచన దేవులపల్లి కృష్ణశాస్త్రి 6-30 గ్రామకార్యక్రమం. 7-0 తెలుగు వా॥ 7-15 రంగులరాట్నం 7-30 ప్రసంగం (క) 7-45 (ఎ) నకలె 9-30 ఎస్. వరలక్ష్మి 9-50 శాస్త్రీయ సంగీతం (8) 10-30 ప్రసార సమాప్తి.

హైదరాబాద్

ఉ॥ 6-55 సుప్రభాత్ 7-0 తెలుగు వా॥ 7-15 వసంతా సుందరం 7-45 కవాలి 8-0 ఆంగ్లవా॥ 8-15 హింది వా॥ 8-30 ఖయాల్.

మ॥ 12-30 (8) 12-50 మరాటీ వా॥ 1-0 శామ్సరి, పిశార్ (8) 1-30 వనితావాణి 1-50 తెలుగు వా॥ 2-0 విద్యార్థుల కార్యక్రమం.

సా॥ 5-30 ఖయాల్ 5-45 కవాలి 6-0 మరాటీ కార్యక్రమం 6-30 కె. ఎల్. సైగల్ (8) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ 7-0 తెలుగు వా॥ 7-15 గ్రామసీమ 7-45 కన్నడ వా॥ 8-0 మద్రాస్ నకలె 9-0 ఆంగ్ల వా॥ 9-15 ఉర్దూ వా॥ 9-30 మద్రాస్ నకలె 9-50 తబ్లా 10-0 ఖయాల్ 10-30 ప్రసార సమాప్తి.

## గూడూరులో దొంగల భయం

గూడూరు, ఆగస్టు 2: గూడూరు పట్టణములో మిట్టవీధిలో రెండు మూడు వారాలనుండి దొంగలు పడుతున్నారు. రెండుచోట్ల దోపుచేశారు, రాత్రి మరల దొంగలు వచ్చినట్లు తెలిసింది. దొంగనే భ్రమతో ఒకరిని ప్రక్కవీధివారు బాదమోదారు. (స్వ. వి.)

## మదరాసు ధరలు

మదరాసు, ఆగస్టు 4:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ

| | | |
|---|---|---|
| సేల్సుటాక్సుతో సహా | రు. | 58 2-0 |
| పెట్లాబంగారం తులం | రు. | 87-4-0 |
| మూస బంగారు | రు. | 86-4-0 |
| సీమవెండి తులం100కి వెండి | రు. | 155-8-0 |
| చిల్లర ధర | రు. | 1-10-0 |

వేరుశనగ

(531 పా॥ 1-కి ఎక్స్పోర్టు సిద్ధంగలు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 122-125-0-0

వేరుశనగనూనె ఎక్సు పెల్లర్ బిలో 8% (500పా.) రెడి చిల్లరధర రు. 243-0-0

టెంకాయనూనె (87½ పౌనులు)

| | | |
|---|---|---|
| అంబువార్కు | రు. | 29-8-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 29-8-9 |
| రాజా బ్రాండ్ | రు. | 28-8-9 |

ఆముదం

తిరుపత్తూరు (500 పా) రు. 200-0-0

పంచదార

| | | |
|---|---|---|
| ప్యారీ | (2 అందరు) | 84-0-9 |
| జపాన్ | (66 పా) | 25-0-9 |
| జర్మనీ | (223 పా) | 81-0-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, ఆగస్టు 4: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 152-10 0 |
| బంగారం (1 తు.) | 86-4-0 |
| సావరిన్ | 57 4-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: 152-5-0 86-2-0; 57-0-0.

"ప్రసిద్ధిచెందిన



జాన్ ఆలారం"
వేవక్-ఖాజానుండి

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St. Madras.